# జీవితం - ముక్తి - మోక్షం

(కర్మ) (జ్ఞానం) (అనుభవం)



## కర్మ - నిష్కృతి - విముక్తి



పబ్లిషర్స్

**వేద - సంస్కృతీ - సంఘం**

(Regd. No. 751/98)

ప్రశాంతినగర్ - పెందుర్తి

విశాఖపట్టణం

ఉత్తరాంధ్ర - ఆంధ్రప్రదేశ్

# జీవితం - ముక్తి - మోక్షం


Written By
ప్రజాకవి
వంగపండు అప్పలస్వామి
ప్రిన్సిపాల్ (Rtd)
ఫౌండర్ కరస్పాండెంట్

ప్రజాకవి - వంగపండు - విద్యాసంస్థలు
జూనియర్ కళాశాల - హైస్కూల్ - పబ్లిక్ స్కూల్
ప్రశాంతి నగర్ - పెందుర్తి - 531173,
విశాఖపట్నం
ఫోను : 824428



ప్రథమ ముద్రణ - 1998
ప్రతుల సంఖ్య - 5000




ప్రతులకు వ్రాయండి
సెక్రటరీ
వేద సంస్కృతి-సంఘం
Regd. No. 751 / 98
ప్రశాంతినగర్, పెందుర్తి-531173
విశాఖపట్నం - ఉత్తరాంధ్ర (AP)

వెల రూ. 25/-లు

# జీవితం - ముక్తి - మోక్షం

(కర్మ) (జ్ఞానం) (అనుభవం)

## అమ్మా-నాన్నలకై - అంకితం

చదువరి కాదు - సత్తెకాలపు మనిషి
మంచితనానికి - మారుపేరు
''మా అమ్మ'' - గంగమ్మ
నిశాని - నిరంతరం పొలం-హలం
కష్టజీవి - రైతు
''మానాన్న''- అప్పునాయుడు

జన్మకు- జాగృతి- తొడిగిన
అమ్మా-నాన్నలకే - అంకితం
ఆపవిత్రమూర్తులకే - అర్పితం.

స్థలం :- పెందుర్తి
తేదీ :- 1-7-98

ప్రజాకవి - వంగపండు
పెందుర్తి
విశాఖపట్నం



ప్రజాకవి - వంగపండు

# జీవితం - ముక్తి - మోక్షం



- సమాప్తం -

## శ్రీ భగవద్గీతా - పారాయణ - మహామంత్ర - పుష్పం

### ఓం! శ్రీకృష్ణ పరమాత్మా - నమోనమః

ఓం! గీతా కల్ప తరుంభజే - భగవతాకృష్ణేన సంరోపితం
వేదవ్యాస - వివర్ధితం - శృతి శిరో బీజం - ప్రభోదాంకురం
నానాశాస్త్ర రహస్య శాఖ- మరతిక్షాంతి ప్రవాళాంకితమ్
కృష్ణాం ఘ్రిద్వయ భక్తి పుష్ప సురభిం - మోక్ష ప్రదం- జ్ఞానినామ్.

పార్థాయ - ప్రతిబోధితాం - భగతానారాయణేన స్వయం
వ్యాసేనగ్రధితం - పురాణ మునినా - మధ్యే మహాభారతమ్
అద్వైతామృత - వర్షిణీం - భగవతీ - మష్టా దశాద్యాయినీమ్
అంబ- త్వా- మను సందధామి భగవ ద్గీతే - భవ ద్వేషిణీమ్
ఓం నారాయణం నమ స్కృత్య- నరం- చైవ- నరోత్తమమ్
దేవీం, సరస్వతీం, వ్యాసం తతో జయ ముదీరయేత్.

### అ ఙ్గ న్యా సః

ఓం అస్య శ్రీమద్భగవద్గీతా శాస్త్ర మహా మంత్రస్య,
శ్రీ వేదవ్యాసో భగవాన్ ఋషిః ! ప్రాయేణానుష్టుప్ ఛందః
క్వచిన్నానాభం దాంసి! శ్రీకృష్ణ పరమాత్మా దేవాతా!
అశోచ్యానన్వశోచస్త్వమ్ ఇతి ''బీజమ్''.
సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ఇతి ''శక్తిః''.
అహం త్వా సర్వపాపేభ్యో-మోక్షయిష్యామి మాశుచః ఇతి''కీలకమ్''.
మచ్చిత్త స్సర్వ దుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి ఇతి ''కవచమ్''.
కిరీటినం, గదినం, చక్రహస్తం ఇతి '' అ స్త్రం''.
అనాది మధ్యాంత మనంత వీర్యం ఇతి ''ధ్యానమ్''.
జ్ఞానయజ్ఞేన భగవద్గీతారాధనార్థే
శ్రీకృష్ణ ప్రీత్యర్థే - గీతాపారాయణే (జపే) వినియోగః.

- మంత్ర పుష్పం సమాప్తం -

---

### జీవితం - ముక్తి - మోక్షం

| | |
|---|---|
| 1. మనోబుద్ధ్యహంకృతి - (బీజమ్) | 4. జీవితం - (కవచమ్) |
| 2. గుణ కర్మ ప్రవృత్తి - (శక్తిః) | 5. ముక్తి - (అస్త్రం) |
| 3. విశ్వాత్మదైవికం - (కీలకమ్) | 6. మోక్షం - (ధ్యానం) |

ప్రథమ భాగం

# మనోబుద్ధ్యహంకృతి

1వ ప్రకరణం

# మనస్సు

ఇంద్రియాణి పరాణ్యాహు
రింద్రియేభ్యః పరం మనః
(భ.గీ 3-42)

శ్రీకరమైనది శరీరం. శరీరం- కర్మ-తప్ప- ఇంద్రియం కాదు. శరీరం ఎన్నటికి శ్రీకరమే-''శరీరం కేవలం కర్మ(భ.గీ4-21)'' దీని వలన స్పష్టపడగలవి. ఇంద్రియాలు (Senses) మనసునకు ఉనికిని- కలిగించగలవి- ఇంద్రియాలే .ఇంద్రియాత్మకమైనదే ''మనస్సు''. మానవుడు- ఇంద్రియ స్వరూపుడు. కర్మకు (Action) ప్రాతిపదిక- ఇంద్రియం (Sense). ఇట్టి కర్మకు సారధి ''స్వభావం ''. మనిషి ప్రవర్తనకు కారణం స్వభావం. ''స్వభావస్తు-ప్రవర్తతే''.(భ.గీ 5-14) స్వభావమును అణచిపెట్టగలది మనసే. మనసు హృదయగతం. స్వభావోద్యాత్మముచ్యతే(భ.గీ).

ఇందువలననే-''క్షుద్రం హృదయ దౌర్బల్యమ్''(భ.గీ-23) అని, మనసును అదుపు ఆజ్ఞలలో నిడమని చెప్పినది. ''ఇంద్రియాణి ప్రమాథీని(భ.గీ 2-60)'' ఇంద్రియాలు ప్రమాదకరమైనవి. ఇంద్రియ విషయములు- శబ్దం- స్పర్శ- రూపం రసగంధం బలీయమైనవి. వీటిని విడనాడటం- ఎవరి తరముకాదు. అయితే వీటిని నిరోధించుకోవాలి, అన్నది ప్రవచనం.

రాగము-ద్వేషము- మనిషిని తప్పుదారిని నడిపే శక్తులు, వీటికి మూల దేవతలు ఇంద్రియాలే.''ఇంద్రియాణి మనోబుద్ధిరస్యాధిష్టానముచ్యతే'(భ.గీ 3-40) శరీరమునకు రూపమును ఇవ్వగలవి ఇంద్రియాలే - ఇందుండి జనించగలది మరేమికాదు ''మనస్సే''. దేహం వినా, ఇంద్రియాలు- అవగాహనకు రావు. వీటిని కలిగిలేని మనస్సు- మనకందదు. బుద్ధికి రూపమిడగలది- మనస్సు.

ఆసక్తి-ద్వేషం- ఇంద్రియ లక్షణం.మనస్సునకు ఆశ్రయాలు. ఇట్టి ఇంద్రియాల్ని-జయించి నిలువాలి. వీటిని విడిచి పెట్టాలని హితబోధ చేయవలను పడదు. ఇంద్రియాలకు లోబడుట వేరు. ఇంద్రియాతీతునిగ మెలగటం వేరు. ఒకరుఇంద్రియాలోలుడు. ఒకరు ఇంద్రియవిజేత. ఇంద్రియ విజేత-ధన్యుడు కధ!

అష్టవిధ ప్రకృతులలో - మనసు ఒకటి(భ.గీ7-40). మనసు చంచలమైనది. విషయ వాసనకలది. నిరోధించబడనిది. అతిదుష్కరమైనది.

యస్త్వింద్రియాణి- మనసా
నియమ్యా రభతేర్జున (భ.గీ-3-7)
ఇంద్రియ నిగ్రహమే-నిష్కామ కర్మ యోగం.ఇంద్రియ విజేత ధన్యుడు.

"చంచలం హిమనః కృష్ణ- ప్రమాధి బలవద్ధృడమ్(భ.గీ. 6-34)." మనస్సు విస్మరించరానిది. అయితే మనస్సును నిరోధించాలి. "యతోయతోనిశ్చరతి మనశ్చంచలమస్థిరం (భ.గీ 6-26)." చంచలమైన మనస్సును, నెమ్మదినెమ్మదిగ మన అదుపు ఆజ్ఞలలో నిడుకోవాలి.

మానవ ప్రవృత్తికి ప్రాతిపదిక-శరీరంకాదు- ఇంద్రియం. ఇందువలన ఏర్పడగలది మనస్సు. ఒకటిని విడచి వేరొకటి మన జాలదు. మనిషి అవగాహన- అనుభూతికి ముఖ్యప్రాతిపదికలు. ఇంద్రియాలు, మనస్సే. మానవుని కర్మ స్వభావము. నిర్ణయించ గలదిట్టులివి.

ఇంద్రియాలు ప్రమాదకరమైనవి. బలీయమైనవి. యజ్ఞశీలుని- వివేకుని మనస్సును హరించగలవి. ఇట్టి ఇంద్రియాల్ని జయించి నిలువాలి. వీటిని విడచిపెట్టమని ఏ ఒకటి ప్రభోధించదు. కారణం-మనసు హృదయగతం - ఇంద్రియాత్మకం-శారీరకరూపం. విదలించుకొనబడదు. మన నుండి విడివడదు. వదలించుకోవాలి.

''పద్మ పత్రమివాంభసా'' (భ.గీ-5-10) - నీటిని తడసిన - తన నంటని - పద్మ పత్రవువలె వ్యక్తి - ఇంద్రియగ్రాన్వితుడైననూ వీటికి లొంగనిరీతిని, వీటిలోనున్నను జీవన్ముక్తుడు కాగలడు.

కోరిక - తృష్ణ కలది - మనస్సు. ఇందుండి జనించగలది సంకల్పం. ఇట్టి సంకల్పమును విడనాడాలి. విడనాడినవాడే విముక్తుడు. సర్వసంకల్ప సన్యాసి విముక్తుడు.'' యోగారూఢస్తదోచ్యతే (భ.గీ).'' కావువునకు ఆది ''భూమిక'' సంకల్పము. దీనిని విడనాడాలి. 'సంకల్ప ప్రభవాన్‌కామాన్ త్యక్త్వా' (భ.గీ6-24).

''సంకల్పం'' వినాదేనిపైన మనకు ''మనస్సు'' లగ్నంకాదు. ఆశకు కోరికకు- ''విషయాసక్తి'' అందుకు దారితీస్తుంది. ఇట్టి విషయాసక్తిని నివారించి- మానవుని ముక్తి పథంవైపు మరలించగలది బుద్ధి. ఏవిషయముపై ఆసక్తి- చూపాలి- ఏవిషయంపై ఆసక్తిని కనపరచరాదని- తనమనస్సునకు ప్రభోధించ గలది తన బుద్ధి తప్ప వేరేమి కాదు. బుద్ధిహీనతే మానవ వినాశానికి నాంది. ''బుద్ధినాశాత్ ప్రణశ్యతి అని చెప్పబడినది (భ.గీ.2-63)''.

మంచి ఆలోచనలకు - చెడు ఆలోచనలకు - సంకల్పాలకు - మూలముగ నిలుచునది ''బుద్ధి''. ఇంద్రియాలతో పాటు - మనస్సును బుద్ధినికూడ - నియంత్రణ పరచనిదే జీవన్ముక్తికి తావుండదు. ''మనసు'' - తదుపరి ప్రాధాన్యతను పొందగలది బుద్ధి.

శ్రీ భగవాను వాచ :

ఇదం శరీరం - కౌంతేయ
క్షేత్రం- ఇతి- అభిదీయతే (భ.గీ-13-2).

''శ్రీ కృష్ణుడు పల్కెను - కుంతీపుత్రా ఈ దేహము (భోగాయతనముగు)''
''క్షేత్రము- అని చెప్పబడును. దీనిని తెలిసికొనువాడు క్షేత్రజ్ఞుడు''

సృష్టి అన్న శరీరం-శంకరుని అభిభాషణ. అంతేకాదు-దేహమనేది లభ్యమైన- జ్ఞాన విజ్ఞానాలు లభిస్తాయి. ''తస్మాత్ దేహం లబ్ధ్వా జ్ఞాన విజ్ఞాన సంభవం'' మహాభారతం.

అంతేకాదు-''కాయేన మనసా బుద్ధ్యా కేవలైః ఇంద్రియైః అపి'' (భ.గీ.5-11) దేహమే(శరీరం) ప్రధాన భూమిక''.దేహినోస్మిన్ యథాదేహే కౌమారం యౌవ్వనం జరా(భ.గీ.2-13)''.

నిజానికి ''దేహ''మనేది ''కర్మ సంభవం.'' కర్మ సంగేన దేహినం (భ.గీ.14-7) దేహమే కర్మ. ''కర్మ'' వలన సంభవించగలది ''దేహం''.

ప్రథమ భాగం

# మనోబుద్ధ్యహంకృతి

## 2వ ప్రకరణం

# బుద్ధి

ఆత్మ బుద్ధి ప్రసాదజమ్
(భ.గీ-18-37)

మనస్సునుండి-''బుద్ధి'' వేరుపడును. మనసునకు మించినది బుద్ధి. దుర్భేధ్యమైన మనస్సును జయించగలది బుద్ధిమాత్రమే. బుద్ధిలేని జీవి బద్ధుడగును.

బుద్ధి వివేకశక్తి గలది. బుద్ధి- మనసును నియంత్రణ పరచగలదు. బుద్ధి- ఒక యోగము వంటిది. బుద్ధులలో కర్మానుష్టాన బుద్ధి- నిష్కామ కర్మానుష్టాను బుద్ధి. ఈరెంటికి మించినది సమత్వ బుద్ధి.- జీవన్ముక్తి తారకం-''బుద్ధియే''. జీవితానికి (బుద్ధి) శరణం గచ్ఛామి.''

దూరేణహ్యవరం కర్మ- బుద్ధియోగాద్ధనంజయ
బుద్ధౌశరణ మన్విచ్ఛ- కృపణాః ఫలహేతవః(భ.గీ.2-49)సమత్వ బుద్ధి కలవారు- సుకృతములనుండి- దుష్కృతముల నుండి రెండింటి నుండి విముక్తులు కాగలరు (భ.గీ. 2-50) బుద్ధిమంతుల యొక్క ''బుద్ధి'' ఆ ''పరమాత్మ'' అని ప్రవచనం ''బుద్ధిర్బుద్ధి మతామస్మి''(భ.గీ 7-10).

ఈ బుద్ధులలో-''అర్పితమనోబుద్ధి''-''నిశ్చయాత్మక బుద్ధి''- ప్రశస్తమైనవి- వ్యవసాయకాత్మికా బుద్ధి (భ.గీ. 2-44) పలువిధములు.

స్వర్గాధిఫలితాల్ని ఆశించు''బుద్ధి''. విషయవాంఛలతోనిండిన ''బుద్ధి''. భోగ్యైశ్వర్యాల సంపాదన బుద్ధి. దైవధ్యానంతో కూడిన బుద్ధి. (భ.గీ. 2-44) బుద్ధి ఒక యోగము. (10-10)అహంకార కారణం ''బుద్ధి''. జీవన్ముక్తి కారణం ''బుద్ధి''(భ.గీ.13-8).

అల్పాబుద్ధి- జగత్ వినాశనకారి. అవివేకికి సమ్యక్ దర్శనం లభించదు. బుద్ధి వైవిధ్యము గలది. అధర్మమును ధర్మమని గ్రహించిన బుద్ధి- తామసిక బుద్ధి (భ.గీ.18-32). అసంధిగ్ధముగ తెలుసుకొను బుద్ధి- రాజసిక బుద్ధి. ఆత్మనిష్టయగు బుద్ధి- సాత్త్వికబుద్ధి.

భౌతిక సంపత్తికి సాధనం ''బుద్ధి''. సృష్టికి దీపం ''బుద్ధి''. ప్రతిభకు పనిముట్టు ''బుద్ధి''. ''బుద్ధి'' ''జ్ఞానము'' సరిసమాన స్థాయిల్ని కలిగినవి కావు. బుద్ధి నుండి ఆవిర్భవించ గలది జ్ఞానం (Knowledge / Devine). నిశ్చయాత్మక బుద్ధిని, జ్ఞానమని చెప్పవచ్చును.

క్రమ వికాస చైతన్య స్థాయిని కలిగినవి ఇంద్రియం- మనసు- బుద్ధి. ఒకటిని విడచి వేరొకటి మనుగడను కొనసాగించలేవు. అయితే ఒకటిని అధిగమించి వేరొకటిని అందగలం. శరీరం రథం వంటిది. అశ్వాలు ఇంద్రియాలు. ఇక సారథి- బుద్ధి తప్ప వేరేమి కాదు. కర్మను అనుసరించ గలది బుద్ధి. నిజానికి
'' ఆత్మ బుద్ధి'' - పరమాత్మతో సమాన మైనది.

బుద్ధులు మూడు విధములు- దేహబుద్ధి- జీవబుద్ధి- ఆత్మబుద్ధి వరుసగ, తామసిక- రాజసిక- సాత్త్వికపరమైనవిగ పరిగణించబడతాయి. కర్మబంధము నుండి మనిషిని విడిపించగలది ''బుద్ధి''.

''బుద్ధ్యాయుక్తోయయాపార్థా'' కర్మ బంధం ప్రహాస్యసి(భ.గీ-2-39) బుద్ధిని వ్యక్తపరచగల కర్మ- శ్రేష్టమైనది. నిష్కామ కర్మ(భ.గీ.2-39). యోగి నిజానికి ఎవరోకాదు, బుద్ధిమంతుడే. సుఖమును సంతృప్తిని ఇవ్వగలది ''ఆత్మ బుద్ధి'' - మనసు నుండి ఆవిర్భవించగలది- ''బుద్ధి''. శరీరేంద్రియం వినా మనస్సు మన కందదు. బుద్ధికి రూపం ఏర్పడదు. ఆత్మ ప్రకాశిక అవతరించదు.

A Pecular mode of ultimate reality determined by a peculiar movement tendency (ప్రవృత్తి) desire / or will / to imagine it is called Buddi (Intellegence mind).

బుద్ధి- ప్రవృత్తి- పరమైనది. 1. స్వార్థబుద్ధి- తామసికం- 2. పక్షపాత బుద్ధి రాజసికం- 3. సర్వోత్తమ బుద్ధి- సాత్త్వికం. లోకోపకారబుద్ధి- నిర్మల మనస్సులో కూడిన బుద్ధి శీఘ్రముగ స్థిరత్వమును చెందును." ప్రసన్నచేత సోహ్యాశుబుద్ధిః పర్యవతిష్ఠతే(భ.గీ 2-65). నిర్మల మనస్సుగల బుద్ధి స్థిరమైనది.

ఇంద్రియనిగ్రహం- ఆత్మచింతన- వివేకబుద్ధికి ప్రాతిపదికలు. బుద్ధియుక్తో జహాతీహ- ఉభేసుకృత- దుష్కృతే(భ.గీ-2-50). సమత్వ బుద్ధి గల జనుడు- పుణ్య పాపముల రెండింటిని, ఈ జన్మయందే- తొలగించు కొనుచున్నాడు. "యోగః కర్మసు కౌశలం" (భ.గీ. 2-50).

"కర్మజం బుద్ధి యుక్తాహిఫలంత్యక్త్వా" - మనీషిణః(భ.గీ.2-51) కర్మలనొనరించినను బుద్ధి బలమున వీటి నుండి విముక్తుడగును. జన్మ బంధము నుండి విముక్తుడగును. "జన్మ బంధ వినుర్ముక్తాః"(భ.గీ.2-51).

అజ్ఞానమును- మాలిన్యమును - దాటగలిగినవాడే- బుద్ధిమంతుడు. పరిశుద్ధుడు. సమాజమున గల జనుడు అనేక విషయాలను- వినవలసి వచ్చును. దేనికి కలత చెందని బుద్ధి- "నిశ్చయాత్మక బుద్ధి". యోగసిద్ధికి ఉపకరించగలది. ఆత్మ సాక్షాత్కారమును ప్రసాదించగలది "బుద్ధి."

చేయదగినదేమి- చేయరానిదేమి- తెలిసికొనగలిగినదేమి! బంధమంటే ఏమిటి ! మోక్షమంటే ఏమిటి! తెలియచెప్పినదే - సాత్త్వికబుద్ధి (భ.గీ.18-30).

ధర్మమును- అధర్మముగ, అధర్మమును- ధర్మముగ, చేయరాని దానిని, చేయుదగినదిగ, చేయుదగనిది- చేయగలిగినదిగ, తెలిసికొనిన బుద్ధి- రాజసికమే అగును.

అవివేకము వలన- కప్పబడినదై- అధర్మమును ధర్మమని- ఎంచునో- సన్మార్గములను, విపరీతార్థముగ మలచునో, ఆబుద్ధి- తామసిక బుద్ధి అనిపించుకొనును.

బుద్ధి త్రయీవిధాత్మకం. తామసిక బుద్ధి, రాజసిక బుద్ధి, సాత్త్వక బుద్ధి. బుద్ధి త్రిగుణాత్మకం. దీనికి మించినది జ్ఞానం.

అందుకే ''హితోపదేశమున'' కర్మా యుక్తం ఫలం పుంసా ''బుద్ధిః కర్మానుసారిణీ'' అని స్పష్టపరచబడినది.

కర్మజం - బుద్ధి

యుక్తా హి( భ. గీ.)

ప్రథమ భాగం

# మనోబుద్ధ్యహంకృతి

3 వ ప్రకరణం

# అహంకృతి

మనోబుద్ధి రేవచ అహంకార
ఇతియం మే భిన్నా ప్రకృతి రష్టధా
(భ.గీ. 7-4)

"కర్మ-జ్ఞానం-అనుభవం" జీవితం. అహంకృతి- ఇహపర సాధనం. వ్యక్తి జీవితానుభవం. సహజవ్యామోహాపేక్షలకు గురి కాగలది- అహంకృతి. అహంకృతికి దర్పణం- "జీవి". అహంకృతికి లోను కాగలది -"జీవి".

ప్రకృతి- ఎనిమిది విధములుగ-విభక్తము కలిగినది. నీరు-నిప్పు-మన్ను- గాలి- ఆకాశం. ఇవి పంచభూతాలు. మరియు మనసు-బుద్ధి-అహంకృతి వెరసి అష్టవిధకూటమి. ప్రాణి ఆవిర్భావానికి ఇవి ప్రాతిపదికలు.

"భూమి రాపోనలో-వాయుఃఖం" (భ.గీ.7-4)

విభజింపబడిన "అపర ప్రకృతి" ఇది. ఇది అల్పమైనది. జగత్తును ధరించునది-జీవరూపమైనది. మరియొక ప్రకృతి-"పరాప్రకృతి" ఇది శ్రేష్ఠమైనది (భ.గీ.-7-5).

అహంకృత్స్న-స్యజగతః. ప్రభవః ప్రలయస్థధా(భ.గీ-7-6). "ఈ ద్వివిధ ప్రవృత్తుల వలన- ఈ సృష్టిస్థితి-లయులకు-కారణభూతుండనునేనే పరమాత్మను".

"అపర ప్రవృత్తి" తెలియబడగలది-"సదసచ్చాహ మర్జున" (భ.గీ.9-19) సత్(దృశ్యం) అసత్(అదృశ్యం) అహం(నేనే) పంచభూతాలు- దృశ్యములు. మనసు బుద్ధి అహంకృతి అదృశ్యవములు. "పరాప్రకృతి" తెలియుబడ లేనిది "సదసత్తత్పరం యత్" (భ.గీ.11-37) దృశ్యా దృశ్యాజగతికి అతీతుడున అంతం -నమధ్యం- న- పశ్యామి ఆదిమ్ (భ.గీ).

‘‘జీవి’’ బ్రహ్మము కన్న-పరుడు కాకపోవచ్చు బ్రహ్మమే భ.గీ.(7-5) బ్రహ్మముతో సరితూగవచ్చు-కాని బ్రహ్మమై నిలువలేదు. The spirit (జీవి) is inseperable from Brahma. equal with Brahma-and Indential with Brahma but it is not - "Brahma".

తన నుండి ఏర్పడిన ఏ ఒకటి అయిన - తనుగ ఉండలేదు. ‘‘సూత్రే మణి గణా ఇవ.’’ (భ.గీ.7-7) దారమందు మణులవలె-తన యందు సమస్త జగత్ కూర్చబడినది (7-7). తన అంశ-తనకు చెందినను- అది తన నుండి వేరుపడిన తదంశముగనే (జీవి) ఉండగలదు-తనుగ ఉండలేదు.

మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః (భ.గీ.-15-7)

‘‘ఈశ్వరస్సర్వ భూతానామ్-హృద్దేశార్జునతిష్ఠతి’’ (భ.గీ.18-61) తన నుండి వేరుపడిన తన అంశ ఒకటి కలదు. ‘‘అగ్ని నుండి వేరుపడి-వెలువడిన అగ్నికణం’’ వలె జీవి-తన అంశ. ఎల్ల జీవులు హృదిలో పరమాత్మగ తనుండగలడు. ఇందువలన ‘‘పర బ్రహ్మ’’ నుండి-‘‘అపర బ్రహ్మ’’ రూపొందినదనుట స్పష్టముకద.

**మనో బుద్ధ్యహంకృతి - జనుడు :-**

మనసు-బుద్ధి-అహంకృతి- త్రిపుటి సంపుటి. మనుజుని ‘‘రూపం’’ అవతరింపజేయగలది. ‘‘జీవి’’ విశ్వతేజోంశసంభవం. జాగృతి దీపిక. పరాపర ప్రకృతి దర్పణం. సూర్యునిలో తేజస్సు-చంద్రునిలో తేజస్సు- ఒకటి ప్రకాశించగలది- వేరొకటి ప్రకాశింపజేయగలది. తనేమిటో-తను తెలిసికో గలిగినవాడు- ‘‘అర్జునుడు’’. తనంటే ఏమిటో ఏమీ తెలిసికొన లేనివాడు- ‘‘జనుడు’’. అర్జునుడు- తనలో నున్న- ఆత్మ దీపికను తను చూడ గలుగును. జనుడు - తనలో నున్న - ఆత్మను తను జూడలేడు.

పరాపర ప్రకృత్తులనుండి ఏర్పడిన- ‘‘అహంకృతి’’ అనేది దైవిక ప్రవృత్తి- తప్ప మన ఇష్టా ఇష్టాల మేరకు ఏర్పడినదిగ ఉండదు. ప్రకృతికి అధిపతి- సృష్టికర్త ప్రవృత్తి. ప్రకృతి నుండి రూపొందగలది. అట్టి ‘‘ప్రవృత్తి’’కి మనము అధీనులమే తప్ప అధినేతలగ నిలవలేం.

జనులు కర్మాధికారులు తప్ప- ప్రకృతికి- ప్రవృత్తికి అధికారులు కారు. అయితే ఈ కర్మల వలన సంభవించు ఫలాఫలితాలపై మన పట్టు ఉండదు. ఇందుకు కారణాలగ మన కర్మలేగాక పరాప్రవృత్తులు రెండును నిలుస్తాయి. ''శరీరం కేవలం కర్మ'' ఇదం శరీరం-క్షేత్రం (జీవి). ఇంతకు మించిన వాడు క్షేత్రజ్ఞుడు (జీవాత్మ). ఉత్తమ క్షేత్రజ్ఞుని (పరమాత్మ) అధీనమున- ఈసృష్టి- స్థితి -లయలు-సంభవించును.

అజ్ఞాన జనిత-వ్యామోహ ఆపేక్షల్ని కలిగినవాడు ''జనుడు''. దురహంకృతీపరుడు జనుడు. జనుడు అల్ప సంతోషి జనుడు- శుష్కవేదాంతి హృదయ దుర్బలుడు-జనుడు.

జనులనందరిని తన వారిగకాక-తనకు స్వజనులుందురని వారిని చంపరాదని- కులక్షయకృతం దోషమని- వర్ణసంకరం నరకమని భయం- భీతి ధర్మ సంకటంతో- వ్యవహరించగలవాడు- జనుడు. ''కార్పణ్యా దోషేనహత స్వభావుడు జనుడు. ఆత్మ జ్ఞాన శూన్యుడు-జనుడు. ధర్మము తెలియని ప్రజ్ఞావాది జనుడు.''

దేహాభిమానిజనుడు. ధర్మాధర్మ వివేకరహిత మనస్కుడు జనుడు. జ్ఞానివలె మాట్లాడి అజ్ఞానివలె విలపించే వాడు జనుడు. సుఖాలకు పొంగి, దుఃఖాలకు లొంగినవాడు జనుడు. నిష్క్రియాపరుడు జనుడే. సంకుచితాత్మను (Limited Self) కలిగినవాడు జనుడు.

తన కర్మలఫలం తన హస్తాల్లోనే ఉందన్న ''అహంకారి'' జనుడు. తనలో గల ఆత్మను కేవలం జీవ చైతన్యమని తనను తను కించపరచుకొనే బలహీనత కలవాడు-జనుడు. దుఃఖితుడు-జనుడు. నిత్య సందేహిజనుడు. కర్మ బంధమున చిక్కుకున్న-వాడు జనుడే. కర్మగతిని తెలిసికోలేనివాడు జనుడు.

# ద్వితీయ భాగము

# గుణకర్మ - ప్రవృత్తి

## 1వ ప్రకరణం

# గుణం

సత్త్వం రజస్తమ ఇతిగుణాః
(భ.గీ.14-5)

"సత్వం - రజస్సు-తమస్సు"-మూడు గుణములు. ఇవి ప్రకృతి జన్యములు. విశ్వ గుణములు. వీటిని ఉల్లంఘించడం ఎవరితరం కాదు. ఈమూడింటి వలననే- "గుణకర్మ ప్రవృత్తి" అనేది ఏర్పడును. ప్రకృతి వలన సంభవించగలవి గుణములు.

"సత్త్వంరజస్తమ ఇతిగుణాః ప్రకృతి సంభవాః" (భ.గీ.14-5) గుణములు స్వాభావికములు-త్రయీవిదములని (భ.గీ. 14-5) చెప్పబడినవి. The three modes (Gunas) goodness(satva) passion(Rajas) and dullnesss(Thamas) born of nature(prakrithi).

"పురుషః ప్రకృతి స్థోహి- భుఙ్క్తే ప్రకృతి జాన్గుణాన్(భ.గీ-13-22)". మనం ప్రకృతి వలన పుట్టిన గుణములను అనుభవించగలము. మంచి పుట్టుకలకు చెడు జన్మలకు కారణం - ఈ మూడు గుణములే . త్రిపుటసంపుటి.

గుణమే విత్తు-దానిఫలితమే జీవితం. గుణములు-శరీరానికి చెందినవి. ఆత్మకు చెందినవికావు. స్వభావం వలన కర్మ ఏర్పడుతుంది. కర్మల వలన "గుణములు" వ్యక్తపడుతాయి. "గుణం"లేని కర్మ అంటూ ఉండదు. ఇంద్రియములను ప్రకాశింప జేయగలది "గుణమే".

'' త్రిభిర్గుణమయైఃభావైః ఏభిః సర్వమిదం జగత్-(భ.గీ.7-13)''. సకల జగత్ త్రయావిధ భావములవలన కలుగును. సత్త్వరజ-స్తమ-త్రయావిధ గుణములతో నిండి ఉండును. మానవుడు గుణాన్వితుడు. వీటిని తెలిసికోలేడు. అందుకే గుణములు (ప్రకృతి) మాయగ అభివర్ణించ బడినవి.

అయితే వేదము(కర్మ) త్రిగుణాత్మక విషయం -(కర్మ). ''త్రైగుణ్యా విషయావేద'' (భ.గీ 2-45). దీనిని అధిగమించి ఉపనిషత్(జ్ఞానం) స్థాయిని చేరుకోవాలి.

ఏ ప్రాణికూడ- ఈ గుణములనుండి విడివడి మనజాలదు. వ్యక్తులు-వారిలో గల సహజస్వభావం వలన ''జనించిన-కర్మలవలన,'' వ్యక్త పడుగుణముల మేరకు, విభజన రూపములను, సమాజమున అందగలుగును. వారే తామసికులు (వైశ్యులు) రాజసికులు(క్షత్రియులు) సాత్త్వికులు (బ్రాహ్మణులు). ఆదిలో ''త్రయావర్ణం'' త్రయాధర్మం - కొనసాగినది. తదుపరి ''సంకర వర్ణంతో'' ''చాతుర్వర్ణ్యం'' అయినది. గుణ భేదములున్నవి -1. పరోపకారం శాంతి సత్త్వగుణ జనితములు2. వ్యక్తిగత ప్రయోజనం అశాంతి రాజసికగుణం 3. వ్యామోహం ఆకాంక్ష-తామసిక గుణం. ఒక వ్యక్తిలో ఏ గుణం నిత్యం ప్రకాశికగ నిలుచునో, ఆమేరకు ఆ వ్యక్తి ఆ గుణాన్వితుడిగ పేర్కొనబడును.

నిజానికి ఏ ఒకనిలో, ఈ త్రయావిధగుణ సమ్మేళన జరిగిన గాని, ఆవ్యక్తికిఉనికి మనుగడ వికసనలనేవి, దుర్లభం. సృష్టి-స్థితి-లయలకు నిలయం-''గుణం'' త్రిగుణాత్మకం ఈ ప్రపంచం.

త్రయావిధ స్వభావములను స్పష్టపరచగలవి త్రయావిధ ధర్మనములు-ఈ గుణ త్రయము-సాత్త్విక గుణం (Cosomic quality of goodness) రజోగుణం ( Cosomic quality of passion) తమోగుణం (Cosomic quality of Dullness).

# ద్వితీయ భాగం
# గుణకర్మ - ప్రవృత్తి
## 2 వ ప్రకరణం
# కర్మ

స్వభావ నియతం కర్మ
(భ.గీ - 18-47)

"స్వభావము" నుండి జనించిన-గుణముల వలన వ్యక్తపడగలవి "కర్మలు." గుణం లేని కర్మకు గురుతే ఉండదు. "కర్మ" వినా గుణానికి రూపమే లేదు. గుణకర్మ ప్రవృత్తి ఏర్పడినగాని, మనిషికి వ్యక్తిత్వం ఏర్పడదు.

సాత్త్వక కర్మలు - తపస్సు-నిగ్రహం-ఋజుమార్గం అధ్యయనం
"శమోదమస్తపఃశౌచం" (భ.గీ 18-42)
రాజసిక కర్మలు - పరిపాలన-రక్షణ-దానం
"శౌర్యం తేజోధృతి ర్దాక్ష్యం" (భ.గీ 18-43)
తామసిక కర్మలు - కష్టించడం-పశుపాలన-వర్తకం
"కృషి-గోరక్ష-వాణిజ్యాం" (భ.గీ. 18-44)

"స్వభావనియంత కర్మ (భ.గీ-18-47)." కర్మ స్వాభావికమైనది. స్వభావ నియంతం కర్మ. సహజమైనది కర్మ. స్వకర్మపరుడే సిద్ధిని పొందగలడు. స్వకర్మ నిరతిస్సిద్ధిమ్ (భ.గీ.18-45)-"స్వభావం- స్వరూపం- స్వకర్మ" ధర్మము అనబడును ధర్మమన సహజ ప్రవృత్తి మార్గము-జీవితం.

పరిచర్యలు ఒనరించడం- ఒక కర్మగ చెప్పబడినది. "పరిచర్యాత్మకం కర్మ". తామసిక స్వభావం నుండి (శూద్రులు) జనించగలది తామసిక కర్మ. "తామసికుడు' శూద్రుడు అనబడును." శూద్రస్యాపి స్వభావజమ్". "సేవాకర్మ"-తామసికులు, శూద్రులకు, స్వభావ సిద్ధమైనది. అయితే స్వభావం గుణం వినా, బహిర్గతం కాదు కద. బహిర్గతం కాని గుణం వలన వ్యక్తపడగల కర్మలుండవు. అందుకే శూద్రుని కర్మలు అని చెప్పబడలేదు. పరిచర్య కూడ ఒక గుణకర్మ. త్రిగుణాత్మక కర్మల పర్యవసాన ప్రతీక. కర్మ ఎన్నటికి గుణాత్మకమే కద.

జ్ఞానము లేని అనుభవం, అనుభవం వినా కర్మ, కర్మ వినా జీవితం, ఎన్నటికి కొనసాగదు. కొనసాగనిది. "శరీర యాత్రాపి-చ-తేన ప్రసిద్ధ్యేద కర్మణః

''స్వభావం'' వలన ఏర్పడిన కర్మల వలన వ్యక్తి గుణములు వ్యక్త పడును. ఇటువంటి ''గుణము'' ఏ ఒక దానిని శూద్ర పరముగ చెప్పబడలేదు. ఉన్నవి మూడే గుణాలు. కర్మలేని గుణమెలా సంభవించును. ఇక జాయతే వర్ణసంకరః (భ.గీ.1-41) అన్నందున సంకరగుణము ''సంభవం''. సంకర గుణం నుండి ఏర్పడగలవి- సంకర గుణకర్మలు. ఇవి శూద్ర కర్మలు . ఒక్క ''సేవకే'' ఇవి పరిమితము కావు కద. త్రయీవిధ గుణముల నుండి, ఏకోన్ముఖముగ వెలువడిన, ''సంకర గుణకర్మప్రవృత్తి'' బహుముఖమైన, ''గుణ కర్మ''లను ''వ్యక్తులకు'' సంభవింప చేయును. సంకర గుణకర్మలన- ''త్రివిధాన్విత గుణకర్మ సంజనితులే'' పరులుకారు.

త్రయీవిధ కర్మలు 1. ప్రభోదం- సాత్త్వికకర్మ 2. పాలన- రాజసిక కర్మ- 3. ఉత్పత్తి పంపిణి- తామసిక కర్మ. ఇక సేవలు - శూద్ర కర్మ. సంకర గుణ కర్మలగ ''సేవ'' లుండును. కాయకర్మ(Action) వాచిక కర్మ (Devine) మానసిక కర్మ (Spirit) అవిభాజ్యములు.

శరీర వాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః (భ.గీ-18-15)

''కర్మ'' త్రయీవిధాత్మకం- జ్ఞానం- త్రయీవిధం- అనుభవం

త్రయీవిధాత్మకం - త్రిగుణాత్మకం. మానవజీవితం.

రాగద్వేష రహిత కర్మ- సాత్త్విక కర్మ. నిత్యప్రయత్న- ఫలస్థితి కర్మ- రాజసిక కర్మ. ఆశా వ్యామోహ జనిత కర్మ- తామసిక కర్మ. ఈకర్మలన్నే గుణసంహితాలే. గుణకర్మలనిపించుకొనును. అయితే ''పరిచర్యాత్మక కర్మ'' - శూద్ర కర్మ. అనగా గుణకర్మస్థాయిలో- శూద్రత్వం నిలిపి శూద్ర కర్మగ మలచబడినవి. ఈ కర్మ ''సంకరగుణకర్మ'' తప్ప త్రయీవిధ గుణకర్మలలో ఏ ఒకటిగ ఉండదు. ఏ ఒకటి నుండి ఇది విడివడదు. (Mixture Cosmic quality). నాల్గవ గుణమనేది లేదు కద.

త్రయీవిధాత్మక గుణకర్మ ''సంకర గుణకర్మ'' - ''జాయతే- వర్ణసంకరః'' (భ.గీ.).

శూద్రులు-వైశ్యులు పాపయోని సంభవులనడం. కృషి గోరక్ష వాణిజ్యం- కష్టతరమైనవి. శూద్ర వైశ్యుని కర్మలు. ఈ ఇరువర్ణాల వారిని ''ఒకటిగ'' నిలపినందున -వైశ్య కర్మలలో భాగస్వామ్యం శూద్రునికి లభించినట్లయినది. తామసి కర్మలివి కద-వైశ్య శూద్రులిరువురు- తామసిక గుణకర్మ సంజనితులుగనే నిలవాలి. నాల్గవ ప్రవృత్తి లేదు కద.

సాత్త్విక కర్మ ఫలితం ''నిర్మల సుఖం''. రజస్సు కర్మ- ఫలం- ''దుఃఖమ్''. తామసిక కర్మకు ఫలము అజ్ఞానం. (భ.గీ. 14-16). నాల్గవ కర్మ అనేది లేదు కద.

''త్రిగుణాత్మిక కర్మ, నిష్కామకర్మ''. సమర్థనీయం (Selfless ness action / disireless ness action). కర్మలనందున్న సుఖాసక్తిని, తృష్ణను విడవడటమే కర్మ సన్యాసం. (Renounciation) కర్మ ఫలాసక్తి లేని విద్యుక్త ధర్మమే - ''త్యాగం''. (Relenquishment).

గత ''జన్మ కర్మ'' ఫలితమే - ఈ కర్మ జన్మ అని ప్రభోదిస్తుంది ''పునర్జన్మ సిద్ధాంతం'' ''ప్రారబ్ధకర్మ- అగామికర్మ-సంచితకర్మ'' - త్రయావిధాత్మకం. త్రయావిధకాల గమనం కలిగినది. ''కర్మ'' భూత భవిష్యత్తు- వర్తమాన పరిణితి కలది. పునర్జన్మ సిద్ధాంతం.

వర్తమాన కాలమున అనుభవిస్తున్న- కర్మ ''ప్రారబ్ధ కర్మ'' అనబడును. ఈ ప్రారబ్ధకర్మ వలన అగామి కర్మ సంభవించును. ఈ కర్మ సంచిత కర్మకు మార్గమిడును'' సంచితకర్మ'' - అనగ కూడబెట్టుకొనిన ''కర్మఫలం'' అని అంటారు.

ఒక జన్మలో కూడ బెట్టిన కర్మ ఫలం చెడోమంచో- మరొక జన్మలో ''అగామి కర్మ'' గా వచ్చి ప్రారబ్ధ కర్మగ మారుతుంది. అందుకు ఎట్టి వారికైన కర్మానుభవం తప్పదు (అవశ్యం అనుభోక్తవ్యం) జ్ఞాన విజ్ఞాన సహితం(భ.గీ.9-1).

అయితే కర్మత్వమే సంచిత కర్మకు రూపు రేఖలనిస్తుంది. ఈ కర్మకు అధికారి కర్మిష్టి తనే. అందుకు-'కర్మణ్యేవ్యాధికారస్తే'' అని ధృవీకరించ బడినది. తను కర్మాధికారిగ నిలిచి, తన అగామి, సంచిత కర్మలకు, తగిన ముఖ్య భూమికలను, తనే చేకోర్చుకోవాలి.

మనోబుద్ధ్యహంకృతి గలది - ''కర్మ''
గుణకర్మ ప్రవృత్తి కరం- ''మార్గం''
విశ్వాత్మ దైవికం -'' అభివ్యక్తం''.

కర్మ మార్గ అభివ్యక్తం-''మానవ జన్మ'' -నిత్యదైనందిన జీవితమున నిలువెత్తు రూపమై నిలువగలది- జీవన్ముక్తి నివ్వగలది మోక్ష సాధనకుపకరించ గలది. కర్మ.

## ద్వితీయ భాగం

# గుణకర్మ ప్రవృత్తి

### 3 వ ప్రకరణం

# ప్రవృత్తి

యతః ప్రవృత్తి ర్భూతానామ్

(భ.గీ - 18-45)

''ప్రవృత్తులు'' త్రయీవిధాత్మకమే. ''ప్రవృత్తి'' అనే దానికి అర్థం ఒక మార్గం నివృత్తి- అని తెలుపబడినది. ''ప్రవృత్తి'' అన - ఉత్పత్తి. కర్మ ప్రయత్నం. అని చెప్పబడినది ''కలుగ గలది- ప్రవృత్తి''. దీని నివారణ దుస్సాధ్యం. సాధన తరుణోపాయం కేవలం నివృత్తి మాత్రమే. అన్యథా దీనిని నిరోధించలేము. అప్రతిహతము అనివార్యమైనది.

''యతః ప్రవృత్తిర్భూతానామ్'' - యేన సర్వమిదం జగత్ (భ.గీ-18-45). ప్రవృత్తి అనాది. అది పురుషుని అధీకృతం. ఏ ఒకరిని మనం తెలిసికోన గోరిన అతని ప్రవృత్తిని మనం తెలిసికోవాలి. నహి ప్రజానామి తవ ప్రవృత్తిమ్ (భ.గీ-11-31). నీ ప్రవృత్తిని తెలియకున్నాను -''అర్జును ఉవాచ.''

''అప్రవృత్తి'' - అన ప్రయత్న శూన్యత, ఇది ప్రమాదకరం. ''ప్రవృత్తి'' అనిన- ''సంసారసాగరం'' - అని వేదాంత పరమైన అర్థం. సాధారణముగ దైవిక ప్రవృత్తి- అసుర ప్రవృత్తి అనడం- సర్వసాధారణం. అయితే గుణ కర్మలవలె- సహజ ప్రవృత్తులు కూడ మూడు విధములు. ఇవి మినహా వేరే ప్రవృత్తులు ఉండవు.

1) సాత్త్విక ప్రవృత్తి - (Wisdom - state of being)
2) రాజసిక ప్రవృత్తి - (Greedy - state of being)
3) తామసిక ప్రవృత్తి - (Dullness - state of being)

ఎప్పుడు ఏదో ఒక పనిని ఒనర్చుటలో నిమగ్నమై నిలచినదే ''ప్రవృత్తి'' (Station) ప్రవృత్తి ఒక అశ్వం వంటిది. రౌతుకి అశ్వం పై అదుపు ఆజ్ఞలు ఉండాలి. లేనిచో రౌతును ప్రవృత్తి క్రిందపడవేయ వచ్చును.

వ్యక్తి బాహ్య పరమైన జీవితం- అతని అంతరంగిక ప్రవృత్తికి నిదర్శన రూపం. (Man's out world life must experess his unword life).

1) గంభీర మనస్కులు- ప్రశాంత చిత్తులు-సదా ఆలోచనా నిమగ్నులు సాత్త్విక ప్రవృత్తికల వారై ఉందురు. వీరిని అంతర్వర్తనులని పిలవవచ్చు. (Introverts)

2) అహంభావపూరితులు వారు- దర్పాంకు ప్రతీకలు- నిత్య కీర్తి ప్రతిష్టలకు ఉవ్విళ్లూరు వారు- రాజసిక ప్రవృత్తి కలవారై ఉందురు. వీరిని బహిర్వర్తనులని పిలవాలి. (Extroverts)

3) ఆశావ్యామోహ సంజనితులు- నిత్య ప్రయోజన మార్గాల్లో నిమగ్నులు అంతర్వర్త మరియు బహిర్వర్తనులు- తామసిక ప్రవృత్తి కలవారై ఉందురు. (Introverts - Extroverts).

అంతరాత్మకు చెందినవి- ప్రవృత్తులు "అవిభాగాత్". పూర్తిగ విభజనకు రానివి. రజోగుణ ప్రవృత్తిని లోభ ప్రవృత్తి అని అందురు. లోభ-మోహమ దమాత్సర్యాలు రాజసిక ప్రవృత్తి జన్యములే. మనశ్శాంతిని చెరచేవి. ఇంద్రియ నిగ్రహాన్ని- నిరసపరచేది " ప్రవృత్తే". "లోభః ప్రవృత్తి రారంభః కర్మణా మశమః స్పృహా" (భ.గీ.-14-12).

జీవిత వాంఛల్ని- లౌకికల్ని- జీవితాశల్ని నెరవేర్చుకోను జూచునదే వ్యక్తిగత స్పృహ- రాజసిక ప్రవృత్తి పర్యవసిత రూపం. (The possenate seeking of life and its pleasure arises from the domonance of రజో గుణ ప్రవృత్తి.

జీవితం ప్రవృత్తి పరం. మన- కర్మ- మన ఇచ్ఛ మన ప్రవృత్తికి స్వభావముగ నిలుస్తుంది. "మన జ్ఞానం"- మన ప్రవృత్తికి- స్వరూపముగ నిలుస్తుంది. మన అనుభవం- మన క్రియా ప్రవృత్తికి- స్వకర్మగ నిలుస్తుంది. "కర్మ జ్ఞానానుభవం" ఇచ్ఛా- జ్ఞాన క్రియా శక్తుల మూలమే తప్ప వేరేమి కాదు. (The gross body, the causual body, the stable body).

ఇందువలన వ్యక్తికి "ప్రవృత్తి" ఒక జీవిత ధర్మముగ నిలుస్తుంది. ప్రవృత్తి త్రయాం విధాత్మకమే: కర్మ జ్ఞానానుభవం- జీవితం- కర్మ ప్రవృత్తి+ జ్ఞాన ప్రవృత్తి+ అనుభవ ప్రవృత్తి =జీవితం.

**కర్మ ప్రవృత్తి ( శారీరక ప్రవృత్తి ) (Five of Action) :-**

ఆకాశం (Ethen)- అగ్ని (Fire)- గాలి (Air)- నీరు (Water)- భూమి (Earth) పంచభూతాలివి. కర్మ ప్రవృత్తి వలన "కర్మేంద్రియాలు" కన్ను ముక్కు- చెవి- చర్మం- నాలుక- బహిర్గతమగును. కర్మేంద్రియం క్రియను చర్య (Action) అని అందుము. ఉదా : కర్మేంద్రియం- వాక్కునకు "క్రియ" మాటలాడుట. కర్మను ఆవేశించగలది ఇంద్రియమే. కర్మ ప్రవృత్తి- తామసిక ప్రవృత్తి పరం. ఈ ప్రవృత్తికి నివృత్తులు శారీరక కర్మలు. కృషి పశుపాలన వాణిజ్యం. "వైశ్య శూద్ర కర్మలు".

**జ్ఞాన ప్రవృత్తి (వాచిక కర్మ) (Five of devine):-**

శబ్ద (Sound) స్పర్శ (Touch) రూపం (Form) రస (Taste) గంధం (Smell) జ్ఞాన ప్రవృత్తి వలననివి బహిర్గతమగును. జ్ఞానేంద్రియాలివి. త్వక్- చక్షు- కర్ణః జిహ్వా- ఘ్రాణములు. కర్మలలో స్పష్టతను చెప్పగలది ప్రవృత్తి. ఉదా:- మాటలాడుట- కర్మ ప్రవృత్తి. ఇందులో స్పష్టతను చెప్పగలది జ్ఞాన ప్రవృత్తి. ఈ ప్రవృత్తికి నివృత్తులు వాచిక కర్మలు"- శౌర్యం- తేజస్సు దానం- ఈశ్వర భావం. "క్షత్రియ కర్మలు".

**అనుభవ ప్రవృత్తి (మానసిక కర్మ)(Five of Spirit ) :-**

మనసు(Mind) జ్ఞానం(Sense) వివేకం(Interligence) సంకల్పం (will) ఆత్మ (Self) అంతరాత్మ అనుభవ ప్రవృత్తిలోనివి స్పష్టపడును. మానసిక కర్మలివి. ఈ ప్రవృత్తికి నివృత్తులు- మానసికకర్మలు- నిగ్రహం తపస్సు శుచిత్వం అధ్యయనం. "బ్రాహ్మణ కర్మలు".

ప్రవృత్తులను విడదీసి విభజించడం సాధ్యంకాదు. ప్రతి ఒక వ్యక్తిలో- ఈ ప్రవృత్తులు మూడు ఉన్నగాని- అతనికి ఉనికి- మనుగడ- వికసనలు లభించవు. విశేషమేమన ఒకరిలో ఒక ప్రవృత్తి కొట్టొచ్చినట్లు కన్పించగ అతనిలోగల ఇతర ప్రవృత్తులు- అణగి మణగి ఉంటాయి. మానవాత్మ త్రయీవిధ ప్రవృత్తుల సంప్రతీకరణ. మానవ జీవితం- మానవుడు.

గుణకర్మ ప్రవృత్తిని కలిగిలేని వ్యక్తి అంటూ ఉండడు. అతడే జనుడు అని భావించబడును. అయితే ''మనోబుద్ధ్యహంకృతికి'' నివారిణి కాగల ''గుణకర్మ ప్రవృత్తి'' కలవాడు జనుడని గాక అర్జునుడు అని భావించ బడును. మనో బుద్ధ్యహంకృతి నుండి బయటపడినవాడు అర్జునుడు. ఇందుకు లోబడి వ్యవహరించినవాడు జనుడు.

**గుణకర్మ ప్రవృత్తి - అర్జునుడు :-**

అజ్ఞాన జనిత వ్యామోహాపేక్షల నుండి పై దొలగి జనుడు - విజ్ఞాన భరిత ధైర్యస్థయిర్యాల్ని ప్రదర్శించ గలిగిన మరుక్షణం అర్జునునిగ అవతరించును. జనుడు అర్జునునిగ తీర్చిదిద్దబడాలి. జనుడు అర్జునునిగ నిలవగలిగిన జీవితం-ముక్తి-మోక్షం లభించును. లేనిచో అపరిపూర్ణ మానవునిగనే నిలుచును-పరిపూర్ణుడు కాజాలడు.

మనోబుద్ధ్యహంకృతి స్థాయి నుండి జనుడిని తప్పించి అర్జునుని స్థాయికి (గుణకర్మ ప్రవృత్తి) గొనిపోవు బృహత్తర-మహత్తర సాధనం ''తత్వమే''. జనుడి స్థాయి నుండి (జీవి) విడివడి అర్జునునిస్థాయిని (జీవాత్మ) నిలచిన తదుపరి-పాండవ మధ్యముడు- జనుడుగగాక అర్జునునిగ పిలవబడును. జనుడు అర్జునుడు-జనార్ధనుడు-అర్జునుడు ఎన్నటికి మధ్యముడే అగును.

స్వస్వభావమును తెలిసికోలేనిది. సుస్వరూపమును కనిపెట్టలేనిది. స్వకర్మాచరణను అనుసరించలేనిది. ''మనోబుద్ధ్యహంకృతి''. తన స్వభావమేమిటో తనకు ఎరుకపడి, తన స్వరూపమేమిటో తనకు విశదపడి, తన స్వకర్మ ఏమిటో తనకు వివరించగల, స్వాభావిక ప్రవృత్తిని, తను అందుకొనిన మరుక్షణమే జనుడు, అర్జునునిగ అవతరించగలడు.

ఇందువలన ''స్వస్వభావ-సుస్వరూప-స్వకర్మాచరణ'' పరులెల్లరు- ''అర్జునులే''. అజ్ఞానము నుండి విడివడిన వారు గతస్మృతులను మరల పొందిన వారు ''అర్జునులే''. ఏకాగ్రతతో మోహమును విడనాడి-

బోధనను వింటివా అనిన (18-72) వెంటనే 1. మోహము నశించినది. 2. ఆత్మస్మృతి అలవడినది-3. సంశయ నివారణ జరిగినది అని అనగలిగిన వాడు అర్జునుడు. మోహావేశపరుడు- ఆత్మ స్మృతిని విస్మరించిన వాడు అసంశయాత్ముడు జనుడని వేరే చెప్పనవసరం లేదు.

దృశ్యాదృశ్య ప్రపంచాన్ని- విడదీసి చూడగలవాడు- కర్మిష్టి ''అర్జునుడే''. మనసును బుద్ధిని- విడ మరచి అరయగలవాడు కర్మజ్ఞాని ''అర్జునుడే''. ఆలోచనావగాహన్ని- అనుభవంలోనికి తెచ్చుకొనగలవాడు కర్మయోగి- ''అర్జునుడే''. కర్మ జ్ఞానానుభ పరుడు- ''అర్జునుడు''.

తనను బంధం నుండి విడిపించి- జీవన్ముక్తిని ప్రసాదించ గలది- ''కర్మ మార్గం'' అన్నవారికి అర్జునుడు కర్మిష్టిగ కన్పించును. ఇందుకు ''జ్ఞానమార్గం''- సరియైనదన్న వారికి అర్జునుడు కర్మ జ్ఞానిగ కన్పించును. ఒక పక్షి రెండు రెక్కలు ''అద్వితీయ మార్గం'' ఉత్తమం అన్నవారికి అర్జునుడు కర్మయోగిగ కన్పించును.

ఇందులోఏ ఒకరైనా- సమాజంనుండి- విడివడిన వారుగ నుండలేరు. కర్మ మార్గము జ్ఞానమార్గం- రెండు నిష్కామ కర్మ యోగముగ నిలవాలి. కర్మ త్యాగము మంచిదని- గాక కర్మానుష్టానం గొప్పదని గాక -నిష్కామ కర్మయోగం ఇదే ముక్తి దాయికం. అర్జునుడు నిష్కామ కర్మాచరణ శీలి కర్మిష్టి- కర్మజ్ఞాని- కర్మయోగి.

# తృతీయ భాగము

# విశ్వాత్మ - దైవికం

## 1 వ ప్రకరణం

# విశ్వం

## (దృశ్యం)

సద సచ్చాహమర్జున (భ.గీ.9-19)

జగత్ నుండి (World) వేరుపడిన స్వాయంభువు- విశ్వం (The vniverse) దృశ్య పూర్వకమైనది. ''విశ్వము'' ప్రకృతి-పురుషుల పరిణామం సత్యమని, త్రిగుణాత్మకమని, సాంఖ్యము చెపుతుంది.

అయితే ప్రవృత్తిలోని కదలిక (సృజన) పురుషునిలోని మనుగడ (చైతన్యం) విశ్వ సృష్టి పరిణామం. అందువలన ''ప్రకృతి-పురుషుని-సంకల్పము'' విశ్వసృష్టి పరిణామ కారణముగ నిలుచును. ఈ ''సంకల్పము''-పరమాత్మ అధీనము. ప్రవృత్తి-పురుషుని అధీనములో ఉండదు. ''స్వభావం'' ఆధ్యాత్మికం. విశ్వాత్మ దైవిక అభివ్యక్తం. స్వభావోద్యాత్మ ముచ్యతే(భ.గీ.8-3). అనంతం విశ్వతో ముఖమ్(భ.గీ.11-11).

విశ్వం(సృష్టి) నిప్పులలోనుండి కణముల వలె సంభవించునది. వేణువులోని నాదం వలె-పరిణామమందినది. సాలీడు-తనలో నుండి దారము తీసికొనునట్లు నిర్మాణమైనది. తదాత్మానం ''సృజామ్యహం'' (భ.గీ.4-7). విశ్వకర్త ఒకరు ఉన్నాడు. ఉంటాడు. పరమాత్మ (Supreme self) అనంతసత్యం ( Absolute Reality). కాదనిన మనల్ని మనం కాదనుకోవాలి. అనాది-పునాది లేనిది ఉనికి-మనుగడ-వికసనలు మనకెలా సంక్రమిస్తాయి.

దైవం సర్వాంతర్యామి. పరమాత్మ. విశ్వం అనంతసత్యం. పరబ్రహ్మ. అయితే పరమాత్మ-పరబ్రహ్మ ఒకటి కావు. ఒకదానితో వేరొకటి సరిపోల్చదగినది. హిరణ్యగర్భుడు, దైవం. వైశ్వానరుడు దైవం (The soul of world - the cosmos).

“ విశ్వం” దైవంతో సరితూగ గలది-సరిపోల్చ దగినది. అయితే దైవముగ ఇది నిలవదు. (The universe as equal as God but not God) “అహం వైశ్వానరో భూత్వా” సూత్ర మణిగణా ఇవ. ఏకాంశేన స్థితో జగత్. “తేజో జగత్ భాసయతేఖిలం”.

విశ్వ సృష్టికి-పరమాత్మ (దైవం) ఉపాదన కారణమని ఒకరు, కాదు ఇందుకు దైవం నిమిత్త కారణమని వేరొకరు, మరొకరు-సృష్టికి దైవం చేతన కారణమని- ఒకరు అన్నారు. ప్రకృతిని కాదనలేం. కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే(భ.గీ.13-21). (In the production of the body and the senses prakrte (ప్రకృతి) in said to be the cause.)

విశ్వం ఉంది-సృష్టి ఉంది. దైవం లేదనుట కుదరదు. ప్రత్యక్ష ప్రమాణము కోరవడినంత మాత్రాన జగతిలో -లేదనుటకు వలన పడదు. గాలి మన చుట్టూ పరిభ్రమిస్తున్న అది మన కంటికి కన్పించదు. పాలలో వెన్న, చెరుకులో తీపి, వేపలో చేదు, శరీరంలో ఆత్మవలె, సంభవించగల జగత పరిణామాలు. ప్రకృతి సత్యాలివి. అప్రత్యక్షనుభావాలు జగత్ సత్యాలు.

“విశ్వం” స్థావర జంగమాత్మకం (సచరాచరమ్)
“దీప్తిమంతం అనంతం” ఈశ్వరుని తేజోరాశి(కిరీటినం-గదినం-చక్రహస్తం భ.గీ.11-46)
ఇవేమీమో-మాయా రూపాలు కావు-జగత్(విశ్వం)లో స్థిరరూపాలు
జగత్ అంతటా ఉండగలవి-నిండగలవి-విశ్వరూపాలివి
విశ్వకర్తను-విశ్వశక్తిని-విశ్వ తేజస్సును నింపగలవి.

స్వకీయ ప్రభను కలిగినది విశ్వం. తనను తను ఉద్ధరించుటకు గురికాగలది, విశ్వం. విశ్వము పరివర్తన కలది. స్వతేజసా విశ్వం మిదంత పంతమ్ (భ.గీ.11-6). ఉత్పత్తి-స్థితిలయల హేతువు విశ్వం. విశ్వంలోక త్రయీ, విశ్వకర్త ఈశ్వరుడే. ప్రకృతి-పురుషుని-సంకల్పం- “అపరమాత్మ”.

అగ్ని (Fire) తేజస్సు (Virtue) పృథ్వి (World) ''మూర్తి త్రయం'' దైవ దర్శనాలివి. పరబ్రహ్మ స్వరూపాలు. వాయువు (Air) ఆకాశం (Space) ఆత్మ (Soul) ''అమూర్తి త్రయం'' దైవనిదర్శనాలివి. పరమాత్మ రూపాలు. ఆ మూర్తి త్రయం- పారమార్థిక సత్యం (Absolute) పరబ్రహ్మగ పిలవబడును. ఈమూర్తి త్రయం- పురుషోత్తమునిగ- (Superme Self) పరమాత్మగ భావించబడును. మూర్తి త్రయాన్ని కాదనలేం ఏ అమూర్తి త్రయాన్ని మనం లేదనలేం - మూర్తిత్రయం + అమూర్తి త్రయం = విశ్వాత్మదైవికం. దైవానుగ్రహం- దైవం.

1) విశ్వమంతయు నేనే (Diesm) (సత్యస్వరూపుడు)
2) విశ్వము నేనే (Patniesm) (సర్వాంతర్యామి)
3) విశ్వం మంత నేనే (Theism) (సృష్టికర్త)

విశ్వానికి (సృష్టికి) దైవం అతీతుడనుట కుదరదు. దైవం- విశ్వాత్మ దైవికం. పరమాత్మ (Person) ప్రకృతి స్వరూపుడు. అయితే విశ్వమే దైవంగా నిలవదు. (The universe is as equal as God but not God and God is above to all) దైవము విశ్వ రూపుడు. అయినా విశ్వానికి పరిమితుడు. మరియు విశ్వాతీతుడు అద్వితీయుడు. విశ్వాతీతుడు- విశ్వాత్ముడు.

''అనంత దేవేశ- జగన్నివాస- త్వమక్షరం- సదసత్తత్పరం యత్'' (భ.గీ.11-37) జగదాశ్రయుడవు- అనంత స్వరూపుడవు- సత్- అసత్‌లకు స్థూల- సూక్ష్మ- జగత్‌లకు రెండింటికి పరమైనట్టి అక్షర పరబ్రహ్మమే ''దైవం''. విశ్వాధిపతి (Inner controller to regulate the universe) విశ్వాంతర్యామి. హిరణ్యగర్భుడు. (The soul of the world) వైశ్వానరుడు. (The equallent as god) విశ్వం- దైవంతో సరితూగగలది. అయితే విశ్వం దైవంతో సరిపోదు- దైవంతో సమానమైనది.

ఐశ్వర్యం- సిరిసంపద- శ్రేష్టత్వం- ఉత్సాహం- బలం వీటిని కలిగిన- వస్తువు లేదా ప్రాణి ''విశ్వతేజస్సు'' కలదిగనే ఉంటుంది. విశ్వం తేజస్సు కలది. ''మమ తేజోంశ సంభవం'' (భ.గీ.10-4).''

తృతీయ భాగం

# విశ్వాత్మ దైవికం

**2వ ప్రకరణం**

# ఆత్మ

**(అదృశ్యం)**

సద సత్తత్పరం యత్
(భ.గీ.11-37)

"ఆత్మ" అవి భాగాత్-అనోరణుః. బుద్ధికన్న వ్యతిరేక్తమై ఇందుకు సాక్షిగ ఉన్నది. అది ఆత్మ. "ఆత్మా-ఇదం సర్వం" అని చెప్పబడినది. మనస పరాబుద్ధిర్యో బుద్ధేః పరతస్తుసః(భ.గీ.3-42) బుద్ధి కన్న గొప్పది. అయ్యది "ఆత్మ"- అని చెప్పబడును.

వైశేషికులు- ఆత్మకు గుణమును ఆపాదించిరి- త్రిగుణాత్మకమనిరి. ఆత్మ వివేకం కలది. అస్థిత్వం కలది. అయితే వ్యక్తిగత ఆత్మలు (Individual souls) చేతన ప్రవృత్తి నుండి గాక, అచేతన ప్రకృతి నుండి రూపొంద గలవి. ఇవి మూల సత్యాలుగ నిలవవు. శరీరం కేవలం ఒక కర్మగ చెప్పబడినది. తాదాత్మ్యధ్యాస అనేది ఒకటుంటుంది. ఇంద్రియాలు, మనస్సు, ధర్మం సుఖ దుఃఖాలు. ఆత్మయందు ఆరోపింపబడుచున్నవి.

అయితే సుఖదుఃఖాల్ని అనుభవించునది "మనస్సు". జీవునికి శరీరం- మనస్సు- ఇంద్రియాలతో సంపర్కం ఉండదనలేం. కర్మత్వమునకు జీవుడు గురికావడమిందు వలనే జరుగును. అందుకు ప్రవృత్తి నుండి ఆత్మను వివేకింపగల శక్తి "ఆత్మ" ద్రష్టగను- సాక్షిగను- గ్రహింప గలదు- ఆత్మకు జనన మరణములు- వృద్ధి క్షయాలు లేవు. శరీరం నష్టమైన- ఈ ఆత్మ వినష్టం కాదు. ఈ ఆత్మ నిత్యం. సర్వ వ్యాప్తము. స్థిరం - నిశ్చలం- పురాతనం.

నిత్య స్సర్వ గతః స్థాణుః అచలోయం సనాతనః (భ.గీ.-2-24)

అవ్యక్తయం- అచింత్యయం- అవి కార్యోయం- ఉచ్యతే (భ.గీ.-25)

దేహంతోపాటు- ఆత్మకు చావు పుట్టుకలున్నవని ఒకవేళ నీవు భావించిన పుట్టినవానికి చావు తప్పదు-చచ్చినవానికి పుట్టుక తప్పదు "జాతస్యహి ధృవోమృత్యుః- ధ్రువం జన్మ మృతస్యచ(భ.గీ.2-27)".

''దేహీనిత్యమవధ్యోయం-దేహేసర్వస్య భారత'' (భ.గీ.2-30) సకల ప్రాణుల దేహాలలో నివలసించుయున్న ఈ ఆత్మ యెన్నడును చంపబడదు- శాశ్వితుడు-స్థిరుడు-చావు పుట్టుకలు లేనిది. ఆత్మయందు ప్రీతిని- ఆత్మయందే తృప్తిని- ఆత్మయందే సంతుష్టిని పొందిన వ్యక్తి జీవన్ముక్తుడు-స్థిత ప్రజ్ఞుడు. ''ఆత్మన్యే వాత్మనేతుష్ట స్థిత ప్రజ్ఞస్యదోచ్చతే(భ.గీ.2-25) కారణం. అప్రమత్త పురుషుని- కర్మలు ఎన్నడు బంధించలేవు. ఆత్మ వలననే ఆత్మనం ఉద్ధరించుకోవాలి- ఆత్మను ఆధోగతిని పొందించ గలది- ఔన్నత్య పథంలో నిలుపగలది ఆత్మే. ఆత్మే ఆత్మకు బంధువు. ఆత్మే ఆత్మకు శత్రువు.

'' ఉద్ధరే దాత్మనాత్మానం - నాత్మాన మవసాదయేత్''

'' ఆత్మైవహ్యాత్మనో బంధుః ఆత్మైవరిపురాత్మనః'' (భ.గీ. 6-5).

తన్ను తానే ఉద్ధరించుకోవాలి-తనను ఉద్ధరించ నెవరూరారు. ఇంద్రియాలకు వశమైనతన ఆత్మ తనకు శత్రువగును. ఇంద్రియాతీతమైన తన ఆత్మ తనకు బంధువు అగును.

''కర్మ''స్వభావం కలది-ప్రకాశించ గలది - ''జీవి''(విశ్వం)

''జ్ఞాన''స్వరరూపం కలది - ప్రకాశింపబడేది -''జీవాత్మ''( ఆత్మ)

''అనుభవ'' స్వకర్మ కలది - అద్వితీయం-''పరమాత్మ''(దైవికం)

విశ్వాత్మ-వ్యక్తిగత ఆత్మ ఎన్నటికి పరస్పర విరోధ భావమునుం- ప్రకటించకోవు-యోగాభ్యాసమున మొలకెత్తగలది ఆత్మ దర్శనం. ఆత్మ- ఆత్మను దర్శించడం తన ఆత్మ అన్నింటిలో నిలయం-అన్నింటిలో తన ఆత్మ ప్రదర్శితం- తన నుండి వేరు పరచి-తను ఎల్లరిలోనున్న ఆత్మనని పరమాత్మ స్పష్టపరచినది- ఈశ్వరస్సర్వ భూతానాం - హృద్దేశార్జునతిష్టతి(భ.గీ.18-6).

''పరమాత్మ'' తెలియబడగలది-''సదసచ్చాహమర్జున''( భ.గీ.) పరమాత్మ. తెలియబడనిది-''సదసత్తత్పరం యత్''(భ.గీ.).

(సత్+అసత్+అహం)=దృశ్య జగతి - (సత్+అసత్+పరం) అదృశ్యతిజగతి.

అహమాత్మా గుడాకేశ-సర్వభూతాశయస్థితః(భ.గీ-10-20) ప్రాణుల ఆది మధ్యాంతము తనే. ప్రాణుల హృదయాల్లో-నున్న ప్రత్యగాత్మ తనే. సృష్టి స్థితిలయ కారణం-పరమాత్మే కాగలదు. పరబ్రహ్మమై నిలవగలదు.

మనస్సును ఆత్మయందే నెలకొల్పుకొనగలవాడే ధ్యానియోగి. ధన్య జీవి ధన్యాత్ముడు-జీవన్ముక్తుడు'సతతమాత్మానం' -యతచిత్తాత్మా''(భ.గీ6-10).

# తృతీయం భాగం

# విశ్వాత్మ దైవికం

## 3వ ప్రకరణం

# దైవికం

(దృశ్యాదృశ్యం)

అనాది మత్పర బ్రహ్మ

(భ.గీ.13-13)

"ప్రకృతి పురుషుని సంకల్పం"-"విశ్వం+ ఆత్మ+దైవికం." క్షేత్రం + క్షేత్రజ్ఞుడు + ఉత్తమ క్షేత్రజ్ఞుడు. పురుషుడు + ఉత్తమపురుషుడు. పురుషోత్తముడు. త్రయీవిధాత్మకం. విశ్వాత్మ దైవికం.

"దైవం" నుండి-"విశ్వం"- "ఆత్మ" విడివడవు. వీటి నుండి విడివడనిది "విశ్వాత్మ దైవికం."-విశ్వాత్మ దైవిక పర్యవసిత రాగరూప సారుప్యతే-"పరమాత్మ" (Supreme self).

క్షరాక్షరుల కన్నవేరైన వాడు ఉత్తమ పురుషుడు. పరమాత్మ. "ఉత్తమః పురష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః(భ.గీ.15-17) పరమేశ్వరుడు. గొప్ప ప్రభువు .నియామకుడు.పరమాత్మ అని చెప్పబడుచున్నాడు ."పరమాత్మేతి చాప్యుక్తో"దేహేస్మిన్పు రుషః పరః(భ.గీ.13-23). పురుషుడు (ఆత్మ) శరీరము నందున్నప్పటికిని- శరీరం కంటె వేరైనవాడు "పరమాత్మ".

విశ్వం (World) ఆత్మ (Self) దైవికములు "God Grace"తప్ప దైవాలుగ నిలవవు. (They are identical and in separable and equal with God but they are not God) కారణం-"జన్మ" "అస్థిత్వం" "వృద్ధి" కలిగినది. పవిత్రాత్మ కలది "పరమాత్మ" షడ్విధభావ వికారాల్ని కలిగిలేనిదిపరమాత్మ. (Devine Self / Supreme Self).

దేవ దేవుడు. జగత్పతి. ఈశ్వరుడు.పరమాత్మ. పరబ్రహ్మ. పరమ పురుషుడు. పలుమార్లు వ్యక్తపడగలవి. దైవికం, "దైవం",అనిగాక ఎల్ల స్మృతులలో దేవేశుడు దేవ దేవుడు అని చెప్పబడినది. ప్రకృతి పురుషుని తన అధీనమున నిలుపుకొను ఈశ్వరుడే-పరబ్రహ్మ పరమాత్మ జనార్ధనుడు.

సాత్త్విక గుణకర్మవలన జనించు, సాత్త్విక జ్ఞానం మేరకు అనుభమును, అందించగల ''సాత్త్విక ప్రవృత్తి''-''ద్వైవికం.'' రాజసిక గుణకర్మ వలన జనించిన రాజసిక జ్ఞానంతో, అనుభవంను అందించగల ''రాజసిక ప్రవృత్తి'' ''ద్వైవికం.'' తామసిక గుణకర్మ వలన జనించిన తామసిక జ్ఞానం మేరకు అనుభవం అందించ గల ''తామసిక ప్రవృత్తి'' ''ద్వైవికం.''

మనో బుద్ధ్యహంకృతి మేరకు- ఏర్పడు ''స్వభావం''. గుణకర్మ ప్రవృత్తి మేరకు రూపొందు ''స్వరూపం''. విశ్వాత్మద్వైవికం వలన ఏర్పడు'' స్వకర్మాచరణ'' ''జీవిత ధర్మంగ'' నిలుచును. ''ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే(భ.గీ.4-8)'' ''ద్వైవికం''-ద్వైవం ధర్మస్థాపన కలది.

ప్రకృతి (విశ్వం)(World) పురుషుని(ఆత్మ)(Self) వలన వ్యక్తపడు ''సంకల్పం'' ద్వైవికం, విశ్వాత్మద్వైవికం. మన వేదమత త్రిమతాచార్యులు ముగ్గురు- మూడు విధాలుగ పరమాత్మను అభిభాషించారు. ఒకరు ద్వైవమునకు విశ్వమును దీపికగ నిలిపితే, వేరొకరు, ఆత్మను ద్వైవ రూపముగ ప్రతిష్ఠింపజేసారు. మరొకరు ద్వైవమే విశ్వం- విశ్వమే ద్వైవం- అన్నారు.

జీవుడు- దేవుడు- వేరు వేరుగ తలచిన వారు ద్వైతులు- అనబడుదురు. అయితే అద్వైతులు- జీవి+ దేవుడు వేరు వేరు అనక జీవేశ్వరుడే ''ద్వైవమని'' అందురు. ''అద్వైతము'' ద్వైవత్వానికి నానాత్వం అంగీకరించదు.

ఇక విశిష్టా ద్వైతులు- జీవాత్మ- పరమాత్మ ''అభేధమని భావింతురు.'' ఆదిలో వెలసినది- ద్వైతమే- చివరిగ నిలచినది అద్వైతము. ''గీత'' అద్వైతామృతవర్షిణి.

విశ్వం(ప్రకృతి)(జీవి) పురుషుని(ఆత్మ)(జీవాత్మ) సంకల్పం, ద్వైవేచ్ఛ తప్పించి, ఆత్మ సంకల్పం, ద్వైవేచ్ఛగ ఎన్నటికి నిలవదు. ద్వైవమే ఆత్మ అనేవాదం ఆత్మే ద్వైవమన్న వాదం రెండూ అపరిపూర్ణమే. ఇవి సమన్వయపడి- విశ్వం+ ఆత్మగ నిలచిన ద్వైవికమగును. విశ్వాత్మద్వైవిక అభివ్యక్తం- సంకల్పం- అనుగ్రహం. ద్వైవానుగ్రహం- సర్వ ధర్మాన్‌పరిత్యజ్యా- మామేకం శరణవ్రజ- అహంత్వా- సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః(భ.గీ.18-66).

గీతా ప్రవచన మున- చరమ శ్లోకమిది (అష్టాక్షరి మా- మే- కం- శ- ర- ణ- వ్ర- జ).

''దేవుడు'' వేరు ''జీవుడు'' వేరు- అన్నవారు'' ప్రతిమోపాసకులు'' అనగ వీరువిగ్రహారాధనాపరులు. ఈ రెండింటికి (జీవుడు, దేవుడు) అభేధమును పాటించినవారు '' త్రిగుణోపాసకులు''. జీవుడే, దేవుడు- అన్నవారు ''ఆత్మోపాసకులు''. ప్రతిమెరాపాసకులు- త్రిగుణోపాసకులు - ఆత్మోపాసకులు.

మనో బుద్ధ్యహంకృతి-గుణ కర్మ ప్రవృత్తి- మూల దైవికాలుగ నిలవవు.గుణకర్మలు-విశేషణాలని-వైశేషికులు భావిస్తారు. గుణకర్మల్ని కలిగిన వారు మూర్తులు. వీరే-దేవతామూర్తులు. ''దైవం'' దేవతామూర్తులకు అతీతుడు. విశ్వంభరుడు. ''శరీరాలను కలిగినవారు దేవతలు''-వీరెల్లరు మూల దైవాలుగ నిలవరు.దేవతా మూర్తులను మించినవాడు ''దైవం''. కారణం ''దైవం'' ''మూర్తి''మరియు ''దైవం అమూర్తి'' దైవం అద్వితీయము ''సతసత్తత్పరం యత్. ''సదసచ్చాహం.''

**విశ్వాత్మ దైవికం - జనార్ధనుడు**

''జనుని'' ''అర్జునుని''గ నిలుప గలిగిన వాడు, ''జనార్ధనుడు''. జనుడు ఆత్మ కాదు గాని ఆత్మను కలిగిన వాడు ఆత్మకాగలినవాడు. ఇందువలననే పరమాత్మ జనుని అర్జునునిగ నిలిపినవాడు. కనుకనే ''దైవం'' జనార్ధనునిగ పిలవబడినాడు.

సర్వాంతరాత్మ.అధినేత.సాక్షి. జనార్ధనుడు (Supreme Lord) పరమాత్మ. (Suprem Self) ఆత్మసాక్షి. జనార్ధనుడు, జనార్ధనుడు సాకార సద్గుణుడు. (Absolute reality) నిరాకార నిర్గుణుడు (Supreme Self).

ఒకే ఒక ''సూర్యుడు'' జగతి అంతటా వెలుగల్ని ప్రసాదించగలడు. ఒకే ఒక పరమాత్మ సకల జనుల హృదయాల్లో అధిష్టించి ఉండగలడు.

''సదసచ్చాహమర్జున''(భ.గీ. 9-19)

స్థూల రూపం,సూక్ష్మరూపంనేనే. సత్(దృశ్యం) అసత్(అదృశ్యం) అహం (నేనే). ఇచట జనార్ధనుడు- వ్యక్తపడగలవాడు, మరియు అవ్యక్తముగ ఉండగలవాడు. పరబ్రహ్మగ పేర్కొనబడును. (Absolute Reality) జనార్ధనుడు సాకార సద్గుణుడు.

''సదసత్తత్పరం యత్'' (భ.గీ. 11-37)

నీవు దృశ్య జగతివి- అదృశ్య జగతికి అతీతుడవు. చెడుకి (సత్) మంచికి (అసత్) అతీతుడవు. వీటికి - మించిన వాడవు. ఇచట జనార్ధనుడు ఈ రెండింటికి పరమైనవాడు ''అద్వితీయుడు''. అని చెప్పబడినది. ఇచట జనార్ధనుడు పరమాత్మగ అభివ్యక్తపడును. (Suprem Self) జనార్ధనుడే నిరాకార నిర్గుణుడు.

ఓ జనార్ధన। నీవు సత్‌కి- అసత్‌కి పరమైనవాడవు-''అర్జున ఉవాచ'' పరబ్రహ్మం (Supreme self) తనే. నేనే సత్‌ను. నేనే అసత్‌ను.''జనార్ధనుని- ఉవాచ ''. ''బ్రహ్మం'' (Absolute Reality) తనే. ''జీవి''- పరబ్రహ్మము కాలేదు. బ్రహ్మముగ నిలువలేదు. కేవలం అపర బ్రహ్మగ (జీవాత్మ)నే ఉంటుంది. సత్‌కి (ప్రకృతి) అసత్‌కి(ఆత్మ) అతీతమైన వాడవు. అన-ఈ రెంటిని మించినది. ''పరమాత్మ''. (Supreme Self) తప్ప వేరేమి కాదు. ఇందువలన - జీవి- జీవాత్మ పరమాత్మ వాదము. సంభవించును.

పరమాత్మ ఆదిపురుషుడు. జనార్ధనుడు- అనంతుడు. అన్నింటికి అతీతుడు. ''జనులనుద్ధరించ తలంచిన జన్మగలవాడు జనార్ధనుడు. '' జనులనన్నివిధాల రక్షించ సమర్ధుడు. శక్తి యుక్తులు కలవాడు''జనార్ధనుడు'' అని అర్జునుని ఉవాచ.

''ఆత్మ సాక్షాత్కారం'' వలన జనార్ధనుడు అభివ్యక్తపడును.(15-11) సృష్టికి-తేజస్సు-కాంతిని ఇచ్చినవాడు జనార్ధనుడు(భ.గీ.5-12) ప్రాణులకు ప్రాణదాత. సర్వేశ్వరుడు. సృష్టి ప్రదాత. జనార్ధనుడు జ్ఞాన శక్తికి- జ్ఞానదాత. జనార్ధనుడు క్షరాక్షరుల కన్న పరమైన ఉత్తమ పురుషుడు. జనార్ధనుడు(5-16) పరమాత్మే. ఉత్తమ పురుషోత్తముడు (భ.గీ. 15-17).

అక్షర స్వరూపుని(జీవి) కన్న శ్రేష్ఠుడు- జనార్ధనుడు. క్షరస్వరూపుని (ప్రకృతి) కన్న మించిన వాడు జనార్ధనుడు. (15-18) కేవలం జ్ఞానం వలననే తెలియబడగలవాడు జనార్ధనుడు.

నాల్గవ భాగం

# జీవితం

(త్రయావిధాత్మకం)

ప్రథమ ప్రకరణం

# గుణ త్రయం

సత్త్వ రజ స్తమ ఇతిగుణాః

ప్రకృతి సంభవాః (భ.గీ.14-5)

**తామసిక గుణం - (స్వభావం):-**

మూడు విధాల ప్రవృత్తులతో మూడు విధాలైన- గుణములుండును. అందులో ఒకటి తామసిక గుణం. ప్రకృతి వలన సంభవించగల మూడు గుణములలో తామసిక గుణమొకటి.

తామసిక ప్రవృత్తి వలన- తామసిక స్వభావం ఏర్పడును ఇందువలన తామసిక స్వరూపం ఏర్పడును. తామసిక స్వకర్మ- రూపొందును. వర్ణ వ్యవస్థ ఏర్పడుటకు కారణాలుగ నిలచిన గుణకర్మలలో ఒకటి తామసిక కర్మ. శరీర కర్మ- కాయ కర్మ జనుడు. కాయ కర్మ ధారి.

స్వార్థపూరితం. వ్యామోహాపేక్షతో కూడినది తామసిక గుణం. ఆత్మను దేహమునందు బంధించ గలది తామసిక గుణం (14-5). ఈ గుణం అజ్ఞానం వలన కలుగుతుంది. మోహమును కలుగుజేస్తుంది. సోమరితనం- నిద్ర మొదలగువాటికి జీవిని బంధించ వేయగల సత్తాగలది. మోహనం సర్వదేహినాం (14-8) ఈ తామసిక గుణం- సత్త్వరజోగుణాల్ని అణగద్రొక్కజూస్తుంది.(14-10) ఈ గుణం వలన అవివేకం- అజాగ్రత్త- అజ్ఞానం- మూఢత్వం సంభవించును. తమోగుణం- భ్రమను కలుగుజేస్తుంది.

"జఘన్య గుణవృత్తిస్థా- అధోగచ్ఛంతి తామసాః" (భ.గీ.14-18) హీనగుణులను తామసికులు అనిరి. నిమ్నలోకాలకు వారు వెళ్లుచున్నారు. తామసికగుణం కలిగిన వారిని హీనగుణులు అధములని అనడం ప్రకృతి గుణమును అపహాస్యము చేసి అవమాన పరచినట్లు కాగలదు. అయితే ఈ

తామసిక గుణం ఒక సామాజిక ప్రయోజనకారిగ ఉన్నతస్థాయిలో నిలవలేదు. అందుకు హీనగుణమనిరి. ఇది ప్రకృతి సిద్ధ గుణము. ఉనికికి తామసిక గుణం అనివార్యం.

తామసిక గుణం కలవారు ఆహార విహారాలపట్ల శ్రద్ధవహించరు. ఆరోగ్య కరమైన భక్ష్యభోజ్య లెహ్యాలను తీసికోరు. నిత్య వ్యామోహం ఆపేక్ష ఆకాంక్షలతో ఉంటారు. త్రయావిధ యజ్ఞాలలో తామసిక యజ్ఞం ఒకటి. విద్యుక్తము కానిది. అన్నదానము లేనిది మంత్ర రహితమైనది దక్షిణ లేనిది(భ.గీ-17-13).

ఇతరులను అజ్ఞాయిషి పరచుటకు చేసినది తామసిక తపస్సు(భ.గీ.17-19)

ఒకానొక శరీరమునందో ప్రతిమయందో(బొమ్మ) ఆత్మ/ ఈశ్వరుని/ ఉనికి ఉండునని తలచగలదో "ఆజ్ఞానము" తామసిక గుణము వలన సంప్రాప్తమించును. అవివేకముతో చేసిన కర్మ తామసిక కర్మ(భ.గీ.18-23)

పామరుడు, అసంస్కారి, వినయ హీనుడు, వంచకుడు స్వార్ధపరుడు పర పీడకుడు బద్ధకస్తుడు. తామసికుడు "అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠోనైష్కృతికోలసః (భ.గీ-18-28).

కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మస్వభావజమ్(భ.గీ.18-44)

ఇవి నిత్య స్వార్ధ పూరితాలు. నిస్వార్ధముగ నిర్వహించ వలను పడనివి. నిత్యము కృషితో కూడినవి. వ్యక్తి-సామాజిక- ఉనికిని-స్థిరపరచగలవి- స్వస్వాభావిక కర్మ-ముక్తి ప్రదం-అస్వాభావిక కర్మ అరిష్టదాయకం "అస్వభా"వమే "దుస్వభావము."

**రాజసిక గుణం -(స్వరూపం):-**

స్వభావం వలన వ్యక్తపడగలది స్వరూపం. కర్మల వలన తెలియబడ గలవి- గుణములు. త్రయావిధాత్మక గుణాలలో తామసిక గుణం -తదుపరి రెండవ గుణం-"రాజసిక గుణం". ప్రకృతి వలన సంభవించు గుణము రాజసిక గుణము. రమ్మన్న వచ్చేది కాదు. వద్దు అన్న పోయేది కాదు-సహజ సిద్ధ ప్రకృతి గుణము మనుగడకు-రాజసిక గుణం అనివార్యం. వ్యక్తి ఉనికిని తామసిక గుణం తెచ్చిపెట్టగ- ఈ గుణం వలన మనుగడ-కలుగుతుంది.

తామసిక గుణమునకు మించిన గుణము రాజసిక గుణము. ఈ గుణం దేహంతోపాటు దేహినికి సంబంధించినది. శౌర్యం ప్రతాపం-తేజం-క్షమ- ధృతి ఆత్మిక గుణాలు. అంతఃకరణకు ఆత్మకు చెందిన గుణములు.

వర్ణ వ్యవస్థ ఏర్పడుటకు మూల కారణాలుగ నిలచిన త్రయావిధ గుణములలో రాజసిక గుణమొకటి. రాజసిక కర్మ జీవాత్మది అర్జునుడు రాజసిక కర్మధారి "వాచిక కర్మ".

రాజసిక గుణం-సర్వజన శ్రేయోదాయక ఫలితమివ్వగలది-ధైర్య స్థైర్యాలతో కూడినది. రాజసికగుణం-దృశ్య విషయములలో ఎల్లెడల ప్రీతిని-తృష్ణను ఆసక్తిని కలుగజేయునది. రాజసిక గుణం కర్మాసక్తి వలన ఆత్మను(జీవని) బంధించగలది. రాజసిక గుణకర్మ(భ.గీ. 14-7).

రజోగుణం వలన-వ్యక్తులలో భయమావరించును. కార్యాసక్తి-వలన ప్రవృత్తి కర్మలు- ప్రారంభమగును. కామ్య నిషిద్ధ కర్మలపై ఆసక్తి వలన మనశ్శాంతిని- గోల్పోయేలా చేస్తుంది గుణం. ఇంద్రియనిగ్రహము లేకున్న- ఈ గుణము వ్యక్తికి అపకార మొనరిస్తుంది.(భ.గీ. 14-12).

రజోగుణ కర్మ వలన -సంప్రాప్తం కాగలవి- దుఃఖములు(భ.గీ.14-16) రజోగుణం వలన లోభం సంక్రమించును. రజోగుణం కలవారు మధ్యస్థులు- ఈ మూడు గుణములను దాటగలిగిన కర్మ బంధముల నుండి విడివడి- మరణ రహిత ఆత్మస్థితిని పొందగలరు.(భ.గీ. 14-28).జన్మమృత్యు జరాదుఃఖైః- విముక్తోమృతమశ్నుతే(భ.గీ.14-20).

రాజసిక గుణం కలవారు- ఆహార విహారాల పట్ల తగిన జాగ్రత్తలు తీసికొంటారు.దుఃఖ శోక రోగాల్ని కలిగించగల విహారాలు- వీరికి ప్రీతి పాత్రములు.

త్రయావిధ యజ్ఞాలలో రాజసిక యజ్ఞమొకటి. ఫలము గోరునది. డంబము కొరకు చేయునది- రాజసిక యజ్ఞం.

మూడువిధాలైన తపస్సులలో- రాజసిక తపస్సు ఒకటి. అస్థిరమైన- అనిశ్చితమైన ఫలము కలది. దంభముతో కూడినది. ఇతరులచే సత్కరింపబడాలని గౌరవింపబడాలని- చేసినది రాజసిక తపస్సు(భ.గీ. 17-18).

ఏ ధర్మం చేత మనుష్యుడు ఫలాసక్తితో ధర్మార్థ కామాలను అనుష్ఠించునో ఆ పద్ధతి రాజసిక గుణకర్మ పద్ధతి(భ.గీ.18-34). అని అందురు.

## సాత్త్వికగుణం - (స్వకర్మ):-

''త్రయీవిధం'' ప్రాణి స్వభావము వారి వారి గత జన్మ కర్మ సంస్కారాలు (భ.గీ.17-2) స్వభావం వలన- గుణములు వ్యక్తపడును. గుణములు సామర్థ్యము కలవి. దేహమును బంధించ గలవి. సత్త్వగుణమే- సాత్త్విక గుణం తను సత్వ గుణడనని- పరమాత్మ పలికినది. (సత్త్వస్వాహమస్మిన) త్రయీవిధ గుణాలలో సత్త్వగుణ మొకటి త్రయీవిధ గుణాలలో- ఇది గుణ రాజమనుటలో విప్రత్తిలేదు. సాత్త్వికుడే నిత్యం పూజార్హుడు. సాత్త్విక గుణం ఇతరులను బాధపెట్టని- లోకోపకారి. సమాజ ఉనికి- మనుగడ వికసనలకు ముఖ్య భూమిక సాత్త్విక గుణం- వికసనకు సాత్త్విక గుణం. అవసరం అనివార్యం.

దేహ-దేహినికి- భిన్నమైన- అద్వితీయ గుణం ''సాత్త్విక గుణం''. స్థిత ప్రజ్ఞుని రూపొందించగలది సాత్త్విక గుణం. శమదమాది సత్కర్మలకు నిలయం.

వర్ణ వ్యవస్థకు- ప్రధానకారణాలుగ నిలచిన త్రయీవిధ గుణములలో సాత్త్విక గుణమొకటి.

సాత్త్విక గుణం నిస్వార్థముగ నిలువ గలది. వ్యామోహాపేక్షలకు దూరంగ ఉండగలది. ప్రకృతివలన జనులలో వ్యక్తపడగలది. సాత్త్విక గుణం సత్త్వగుణం నిర్మలమైనది. ప్రకాశము గలది ఉపద్రవము లేనిది.

''సత్త్వం సుఖే సంజయితి- రజఃకర్మణి భారత(భ.గీ.14-9) సత్త్వగుణ మనకు ఫలము- నిర్మలసుఖము. సత్త్వగుణ ము- జ్ఞాన సముపేతము(భ.గీ.14-17) ఉత్తమం సాత్త్వికగుణం. మధ్యమం- రాజసిక గుణం. అధమం తామసిక గుణం(భ.గీ.14-18).

యజ్ఞము- మూడు విధాలు- అందులో సాత్త్విక యజ్ఞం ఒకటి ఫలాపేక్ష లేనివారి చేత చేయబడును. శాస్త్ర సమ్మతమగు - యజ్ఞమే- సాత్త్విక యజ్ఞము(భ.గీ. 17-11).

మూడు విధాలైన తపస్సులుంటాయి. అందులో ఒకటి సాత్త్విక తపస్సు. శారీరక తపస్సు- వాచిక తపస్సు మానసిక తపస్సు. ఫలాపేక్ష లేనివారు నిశ్చల చిత్తులు. అనుగ్రహమున అధిక శ్రద్ధతో ఆచరింపబడగలవి మూడు విధాలైన శారీరక, వాచిక, మానసిక తపస్సులు అని అందురు.

ఒకే ఒక సూర్యుడు జగతి అంతటా వెలుగల్ని ప్రసాదించగలడు. ఒకే ఒక పరమాత్మ సకల జనుల హృదయాల్లో అధిష్ఠించి ఉండగలడు ''జనార్ధనుడు''.

''గుణ త్రయం కర్మ బంధము'' త్రయావిధ ప్రవృత్తి గుణాల నుండి- అధిగమించగలిగిన మోక్షప్రాప్తి కలుగును. మనో బుద్ధ్యహంకృతిని నివారించగలిగి- గుణ కర్మ ప్రవృత్తికి నివృత్తిని జరిపిన- విశ్వాత్మ దైవికము అభివ్యక్తమగును- ముక్తి- అలవడును. అనుగ్రహం- లభించును- గుణ త్రయమును అధిగమించగలవాడెవరు। కర్మయోగి- స్థితప్రజ్ఞుడు.

1. తుల్యప్రియా- ప్రియో- ధీరస్తుల్యనిందాత్మ సంస్తుతిః(భ.గీ.14-24.)

మానావ మాన యోస్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః ''సర్వారంభ పరిత్యాగి గుణాతీతస్స ఉచ్యతే(భ.గీ.14-25).''

ప్రియము అప్రియము - సమభావము

నింద-స్తుతి - సమరీతి

అవమానం-గౌరవం -''సమానం''

శత్రువు- మిత్రుడు- సరిసమానం - గుణాతీతునికి.

నాల్గవ భాగము

# జీ వి తం

(త్రయీవిధాత్మకం)

## 2వ ప్రకరణం

# కర్మ త్రయము

కర్మ బ్రహ్మోద్భవం విద్ధి
(భ.గీ.3-15)

### 1. వైశ్యకర్మ (తామసిక ప్రవృత్తి) శారీరక కర్మ :-

ఆంధ్ర శబ్ద రత్నాకరం-''వైశ్య'' అను పదమునకు ''ఉపభోగి'' ''స్వార్థి'' అని అర్థము చెప్పినది ''భోగము'' శారీరకమే. శరీరం కర్మభాగి.

''వైశ్యకర్మ''లు- తామసికం. స్వార్థ పూరితం. నిస్వార్థముగ వీటిని నిర్వహించడమన వీటిని నిర్మూలించడమే. చొరవ, ఉత్సాహం, ప్రోత్సాహం, స్వార్థ ప్రవృత్తి వినా ఇవి వృద్ధిపొందవు. ఇవి తామసిక ప్రవృత్తి పరమైన కర్మలు. శరీరం కేవలం కర్మ- కుర్వాన్నాప్నోతికిల్బిషం(భ.గీ.4-21) శారీర కర్మలకు మనుజుడు పాపము నొందడు. మనస్మృతిలో- యోగ వాసిష్టంలో - ఏ ప్రవృత్తిని కలిగి లేనివారు శూద్రులని వీరిని ఒక వర్ణం, ఒక కర్మను, కలిగినవారిగ ప్రస్తావించనే లేదు. చాతుర్వర్ణవ్యవస్థను ప్రతిపాదించనేలేదు. మూడు వర్ణాలవారికి సేవలొనర్చిన వారెల్లరు శూద్ర వర్ణమని పేర్కొన్నారు. వీరికి గుణ కర్మలనేవి ఉండవన్నారు. ''సేవా కర్మ''అది కూడా గుణ రహితమైనదని పరిచర్యకే వీరు పాత్రులన్నారు.

బ్రహ్మ క్షత్రియ వైశ్యాస్త్రియో ''ద్విజాతీయః'' (మనుస్మృతి)

త్రయో వర్ణాం- జాతీయో బ్రాహ్మణ క్షత్రియ వైశ్యాః(యోగావాసిష్టం)

బ్రహ్మ- క్షత్రియ వైశ్యులు ద్విజులని, ఒకటి తెలుపగ, వేరొకటి మూడే వర్ణాలు- జాతులని తెలిపినది. ప్రవృత్తులు మూడే. వర్ణములు మూడే. ప్రవృత్తి వర్గీకరణకు అనుకూలమైన వర్గీకరణమిది. ''జాయతే వర్ణ సంకరః'' అని అనుటను మనుస్మృతి యోగవాసిష్టం అంగీకరించవు. శూద్రులను గూర్చి ప్రస్తావిస్తూ- ఒక ప్రత్యేక ''పరిచర్య ఆత్మిక కర్మ''ను కలిగిన వర్ణముగ - మొదటిగ చెప్పబడినది, భగవానుని ప్రవచనము భగవద్గీతలోనే. గుణ కర్మ రహితమైన పరిచర్య (సేవ) ఉండదు కద.

బ్రహ్మక్షత్రియ- విశాం- శూద్రాణాంచ పరంతప(భ.గీ.18-41) చాతుర్వర్ణ్యం మయా సృష్టం- గుణకర్మ విభాగశః(భ.గీ.4-13) నాలుగు వర్ణములని- శూద్రులకు ఒక కర్మ అని అది కూడ "ఆత్మిక కర్మ" అని ప్రధానంగ ప్రవచించబడినది- గీతలోనే "పరిచార్యాత్మకం- కర్మ- శూద్రస్యాపిస్వభావజం (భ.గీ.18-44). జాయతే వర్ణ సంకరః (భ.గీ.1-41) అని మంగళాశాసనం చేసింది. కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః(భ.గీ.3-5) అని స్పష్టపరచనది. పాపయోని సంభవులకు ముక్తిని కలిగించినది.

శూద్రులు "స్వభావమున" కలిగి ఉందురు. ఆస్వభావం మేరకు వారికి పరిచర్యాత్మక కర్మ పట్టువడ గలదు. వీరును గుణ కర్మ ప్రవృత్తికి లోనుకాగలరు. వీరి కర్మను, ఆత్మికమని చెప్పినందున త్రయీవిధాత్మక కర్మలలో ఒకటి అయిన తామసిక కర్మగ ఇది ఉంటుంది, లేదా త్రిగుణాత్మిక కర్మ గా ఉంటుంది. పరిచర్యాత్మక స్వభావం నుండి శూద్రులకు ఈ కర్మ ప్రభవించినదని చెప్పినందున- తామసిక స్వభావమును వీరు కలిగి యుందురని స్పష్టపడినది. లేదా త్రయీవిధాత్మక స్వభావులుగ ఉందురుయజ్ఞః కర్మ సముద్భవః(భ.గీ.3-5) కర్మల సముదాయమే యజ్ఞము కద. యజ్ఞమే బ్రహ్మము. త్రయీవిధాత్మకము.

వైశ్య శూద్రులకు ఒకే విధమైన కర్మలె కృషి- గోరక్ష వాణిజ్యం- వైశ్య కర్మలు పరిచర్యాత్మక కర్మ శూద్ర కర్మ. శరీర కర్మ ఉనికి నివ్వగలది.

దేహమునకు(జీవి) పరిమితమైన కర్మ వైశ్యకర్మ. ఉనికి నివ్వగల కర్మ. చాతుర్వర్ణ్యవ్యవస్థలో-వైశ్యకర్మ దేహ(శరీరం) కర్మగ నిలుస్తుంది. శారీరక కర్మలు కలవారు వైశ్యులు. వీరి కర్మలకు ప్రాతిపదిక- తామసిక గుణం. ఈప్రవృత్తి ఈ కర్మలకు జీవము నివ్వలగది. అపేక్షాంశ(తామసికాంశ) మానవుడు బ్రతికి బయటపడి బట్టకట్టడం- ఈకర్మల వలననే సాధ్యం.

"వైశ్య కర్మ"-అప్రధానమనుట కుదరదు- ఈకర్మ ఇహ లోకరక్షణ- పరమునకు మార్గదర్శి. అయితే తామసిక ప్రవృత్తిని విడనాడాలి. కర్మ తామసికమైనదైన మనం దీనిని విడనాడలేం. అది మన ఉనికికి పునాది. అది అందుకు తామసిక కర్మ గీతను(ప్రవృత్తి) దాటి బయట పడాలి, తప్ప, కర్మను కాదని మనం బయటపడలేం. వైశ్య కర్మ- శారీరక కర్మ. ఈకర్మను విడనాడి పలకగలది కేవలం అశరీరవాణి మాత్రమే.

## క్షత్రియ కర్మ (రాజసిక ప్రవృత్తి) వాచిక కర్మ :-

ఆంధ్ర శబ్ద రత్నాకరం ''క్షత్రియ'' అనుపదానికి అర్థం- క్షేత్రం అని వ్రాసింది వివరణ ''క్షుద్''సంభృతా- విస్తరించగలది అని అర్థము. దేహమును విస్తరించగలది ఏమిటి! దేహిని. (జీవాత్మ). దేహి-దేహమును ఉద్ధరించు ''కర్మ'' గలది- ''క్షేత్ర కర్మ''(జీవాత్మ). క్షత్రియ కర్మ.

రాజసిక కర్మ- ''వృద్ధి-జనకం''. మనుగడ నివ్వగల కర్మ. తామసిక కర్మకు (జీవి) మించిన కర్మ, రాజసిక కర్మ(జీవాత్మ). దేహినికి సంబంధించిన కర్మల్ని కలది. శౌర్యం, ప్రతాపం,తేజస్ , క్షమ , ధృతి,సంతృప్తినివ్వగల ఆత్మిక కర్మలు ''రాజసిక కర్మలు''.

అయిన ''దేహ కర్మ'' నుండి(శారీరకర్మ) ''దేహిని కర్మ'' (వాచికకర్మ) విడదీయబడదు. పాలకుని(క్షత్రియుని) కర్మలు స్థిత ప్రజ్ఞత కలవి.

''చాతుర్వర్ణ్య'' వ్యవస్థలో- క్షత్రియ కర్మ-దేహిని కర్మగ నిలుస్తుంది. రాజసిక కర్మలు గలవారు- క్షత్రియులు. వీరు కూడ ద్విజులని పిలవబడుదురు. రాజసిక కర్మ రమ్మన్న ఎవరికయిన వచ్చేది పొమ్మన్న పోయేది కాదు. ప్రవృత్తి పరమున సంక్రమించగలది అలవడగలది. కేవలం పుట్టుక వలన గాక ''స్వీయ ప్రవృత్తి జనకం'' రాజసిక ప్రవృత్తి కలవారికి కేవలం ''రాజసికుడే'' జన్మించుననటానికి లేదు. పిరికి వాడు పుట్టవచ్చు. లేక ధైర్యవంతుడు కలుగవచ్చు.

త్రయీవిధ గుణకర్మలలో రాజసిక గుణకర్మ ఒకటి క్షత్రియకర్మ.

''కర్మ'' వ్యక్తి ''ధర్మముగ'' -నిలబెట్టబడినది. స్వభావ స్వరూప స్వకర్మాచరణే ''ధర్మం''. ముక్తికి మార్గము. ధర్మమే- ముక్తికి మూలము.

క్షత్రియ కర్మకు ప్రాతిపదిక- రాజసిక ప్రవృత్తి. ధీరాంశగల ప్రవృత్తి ఇది. సామాజిక ఉనికికి- అపేక్షాంశ(తామసిక కర్మ) మూల కారణం.అయితే దాని మనుగడకు ధీరాంశ(రాజసికకర్మ) ముఖ్య భూమిక వహిస్తుంది. ఇక వికసన (విముక్తి) వివేకాంశ కలది సాత్త్విక కర్మ ప్రవృత్తి వలననే ఇది సాధ్యం.

కర్మ బ్రహ్మోద్భవం విద్ధి(భ.గీ.3-15)

పరిచర్యాత్మకం- కర్మ- శూద్రస్యాపి స్వభావజమ్(భ.గీ.18-44)

అందువలన కేవలం- రాజసీక కర్మ పరులే సమాజమున శ్రేష్ఠులనడు కుదరదు. త్రయీ విధ గుణకర్మలలో సమైక్యత సిద్ధించినగాని, సమాజానికైనా వ్యక్తికైన జీవన్ముక్తి ''శక్తి'' లభించదు. శాంతి భద్రతల్ని చెరచ గలది- చేకూర్చ గలది రాజసీకర్మ. పరాక్రమవంతమైన కర్మ ఇది. సాహసిక తీవ్రమైన చర్యకు పర్యవసిత రూపం. విజ్ఞాన దాయకం, ఇహలోక సుఖప్రదాయిని, ''క్షత్రియకర్మ.''

ఇందువలననే తామసిక కర్మ''శరీరమని'' రాజసిక కర్మ ''శరీరధారిణి'' యని ప్రవచింతురు. దేహము(జీవి) ధరించు దేహిని (జీవాత్మ) అభివ్యక్తపడును. హృదయ దుర్బలత గలది వైశ్యకర్మ (జీవి) స్థిత ప్రజ్ఞతను పొందగలది క్షత్రియ కర్మ (జీవాత్మ).

కర్మలలో హీనమైనవి నీచమైనవి అంటూ ఉండవు. ఉన్నవి ''త్రయీవిధ కర్మలే'' అనార్యుల కర్మ- తామసిక కర్మ అని, అందురు. ఆర్యుల కర్మ- రాజసిక కర్మ అని అందురు. అనార్యుల కర్మ తామసిక ప్రవృత్తి గల ''కర్మ''. తామసిక కర్మ ప్రవృత్తి నుండి విడివడి రాజసిక కర్మ ప్రవృత్తి పరిధిలోనికి రానిదే, సాత్త్విక కర్మ ఎవరికి అలవడదు. జీవన్ముక్తి దుర్లభం.

**సాత్త్వక కర్మ (సాత్త్వక ప్రవృత్తి) మానసిక కర్మ :-**

ఆంధ్ర శబ్దరత్నాకరం- బ్రహ్మ అను మాటకు- ''వృద్ధి'' ''జనకుడు'' అని అర్థము చెప్పినది బృహ్- ''వృద్ధిజనకం''.

''సాత్త్వక కర్మ''- దేహదేహీనంలకు- ''అద్వితీయంము''. పవిత్రమైనది. ఒక పక్షి రెండు రెక్కలు కలది. జీవికి చేతన దాత. పర బ్రహ్మ- జగతికి అధిపతి.

శమం- తమం- తపం- నిర్మలత్వం- శాంతి అనేవి శారీరక వాచిక కర్మలకే పరిమితం కావు. ఇవి ఆత్మ పరమైనవి కూడ పారమార్థికసత్యము తెలుపగలవి. వృద్ధిజనకం- సాత్త్వక కర్మలు.
దేహము (Body) దేహానికి (Soul) భిన్నమైన ''అద్వితీయ కర్మ'' సాత్త్వక కర్మ.

కర్మ ప్రవృత్తి వలన జ్ఞాన ప్రవృత్తి-సంభవించును-అనుభవ ప్రవృత్తికి మార్గమిడును-కర్మ (Action) జ్ఞానం (Devine) అనుభవమే (Spirit, మానవ జీవితం. జ్ఞాన విజ్ఞాన మాస్తిక్యం- బ్రహ్మకర్మ స్వభావజం(భ.గీ.18-42).

ఈ పరిణామ క్రమం "జీవి". స్వభావం-స్వరూపం స్వకర్మాచరణకు-క్రమ వికాసముగ ఉంటుంది.(Evolution of human soul) జీవి హృదయదౌర్బల్యం కలది. హృదయదౌర్బల్యం క్షుద్రమైనది. జీవిని, ఈ స్థాయిని అధిగమించి, "అధ్యాత్మ చేతసా" జీవాత్మస్థాయికి రమ్మని, జనుడిగ (జీవి) విలపిస్తున్న అర్జునుని(జీవాత్మ) జనార్ధనుడు(పరమాత్మ) హెచ్చరిస్తాడు. శౌర్యం తేజోర్ధృతిర్దాక్ష్యం-క్షాత్ర కర్మ స్వభావజమ్(భ.గీ.18-43).

స్వస్వభావం మేరకే "దైవం" అవగతమగును (Action)
సుస్వరూపం మేరకే "దైవం" ప్రత్యక్షమగును (Devine)
స్వకర్మాచరణ మేరకే "దైవం" అనుభవాత్మకమగును. (Spirit)

"శరీరం కేవలం కర్మ" - ఈ కర్మ పరుని శూద్రునిగ కొన్ని స్మృతులలో తెలుపబడిన ఈ కర్మను పరిచర్యాత్మికం అని, మొదటిగ, "ఆత్మిక కర్మ" అని ప్రవచించినది గీతలోనే. అంత వరకు ఉన్న త్రయీవిధ వర్ణవ్యవస్థను కాదని వర్ణసంకరమని వార్యమన్నది గీత. చాతుర్వర్ణ్యవ్యవస్థకు (పరిచర్యాత్మిక కర్మకు) ఆత్మగుణం కల-సంకర గుణకర్మ ప్రవృత్తిని కలుగజేస్తూ "జాయతేవర్ణసంకరః" అని మంగళాశాసనం చేసింది గీత. మానవాత్మ త్రయీవిధాత్మకమని ప్రస్తావించినది. (Tripple disignation of human soul).

ఇంద్రియాలకు రూపమివ్వక-"కర్మకు" శరీరాన్ని ప్రతినిధిగ నిలిపినది. ఇంతకు మించినది జ్ఞానము అని దీనిని మించినది ఆత్మ, అని అభిభాషించుచున్నది. ఇందువలన మనసు-బుద్ధి- ఆత్మ-పర్యవసాన ప్రతిఫలాలే "శారీరక కర్మ" "వాచిక కర్మ" "మానసిక కర్మ" లన్నది తేట తెల్లమైన విషయము.

''శూద్ర కర్మ'' త్రయీవిధాత్మక ''పరిచర్యా కర్మ''. అయితే ఈ పరిచర్యాత్మక కర్మ-కాయకర్మ కాకుండా- పోదు- వాచిక కర్మ కాకుండా దీనిని ఆపలేరు. మానసిక కర్మ నుండి దీనిని వేరు పరచలేరు.

ఇందువలన-వైశ్య శూద్రుల ''కర్మలు'' ఒకే రీతి కర్మలని ప్రస్తావించకనే ప్రస్తావించినట్లవుతుంది. ''జాయతేవర్ణ సంకరః'' ఇందువలన సంకర గుణకర్మ అనేది ఏర్పడుట సంభవం. అయితే ఈ సంకర గుణ కర్మలు ఎవరు! శూద్రుని కర్మ - శూద్ర కర్మ కాగలదన్నది అని చెప్పకనే చెప్పినట్లు అయినది.

గుణకర్మ విభాగం మేరకు- సమాజమునందలి వ్యక్తులను వర్గీకరణ చేయకముందు అనేక పౌరాణిక, గ్రంధాలలో స్మృతులలో శూద్రులు- ''ఆత్మిక-కర్మను'' కలిగి ఉండని వారని, ఒక స్వభావమంటూ-లేని వారని, గుణకర్మహీనులని, పలుమార్లు ప్రస్తావించడం జరిగింది. వారి శరీరం ఒక సేవా సాధనమని ఇతరులకు సేవలొనర్చువారిగ పేర్కొనబడిరి. వీరికి శరీరమే తప్ప- అందులో ''ఆత్మిక'' అంటూ ఏమీ ఉండదు. ''స్వభావం'' అసలే ఉండదు. ప్రవృత్తికి వీరు దూరం. ''గుణ కర్మ ప్రవృత్తి'' లేనివారికి గుర్తుపట్టగల కర్మలేముండును! అన్నది వీరి ధృడమైన అభిప్రాయం- అందుకు ''న శూద్రాయ మతిం దద్యాత్'' (స్మృతి) శూద్రునకు జ్ఞానం ఇవ్వరాదన్నారు. వచనస్య న గ్రాహ్యాం- శునోచిష్టం- హవిద్యదా (చతుర్వింశతి).

కుక్క ముట్టిన - హవిస్సును విడచి పెట్టిన రీతి శూద్ర ప్రవచనాన్ని పరిగ్రహించరాదు. దుశ్శీలోపి ద్విజః పూజ్యో-నశూద్ర విజితేంద్రియాః (స్మృతి) దుష్టుడైన బ్రాహ్మణుడు పూజకు అర్హుడు-మంచివాడైన శూద్రుడు పూజకు అనర్హుడు. నిబంధనలను నిలిపారు.

"ప్రభోదాలు"-"సంకుచితపరిధి" లోనడచిన అవి ప్రవచనాలుగ ఎల్లకాలం నిలువలేవు. నిలబెట్టిన నిబంధనలు ఎల్ల కాలం నిలబడవు కద. ఎల్ల కాలం నిలచేవి-"సూత్రములే. "పెట్టిన నిబంధనలు కట్టుబాట్లు నిలవవు. అని కాలక్రమేణ జనసమాజానికి తెలిసీ వచ్చింది. స్మృతులలోనే మరల ఇలా చెప్పబడింది.

"సుగతి మియాత్ శ్రవణాత్-శూద్రయోనిః (స్మృతి) "శూద్రులు కూడ "బ్రహ్మ జ్ఞానం" తెలిసికొని తరించవచ్చు" అని ప్రకటించబడినది. వేదవాఙ్మయమున మరల వెలుగు జనించినది.

ఇందువలన అంతవరకు "బ్రహ్మజ్ఞానం-పరిధిలోనికి రావటానికి అర్హులుకాని శూద్రులకు బ్రహ్మజ్ఞానం-విని తరించడానికి అవకాశం కలిగింది. నిబంధనలను సడలించారు- ఇందువలన ఇది మరో మార్పునకు దారి తీసింది.

"శ్రవణాత్-అధ్యయనాత్-అర్థప్రతిషేదాత్-స్మృతేశ్చ (బ్రహ్మసూత్రం **3-8**)

"తధభావ నిర్ధారణేచ ప్రవృత్తేః (బ్రహ్మసూత్రం **3-7**)"

"ప్రవృత్తి" అనేది స్వభావమున నిర్ధారణ అవుతుంది తప్ప కేవలం పుట్టుక వలన కాదు. ఒకరు బోధించగవేరొకరి జన్మకు విముక్తి కలుగుతుందన్న విశ్వాస నమ్మకులు మరి కొంత కాలానికి సడలినవి. ఎవరికి వారు శూద్రులతో సహా "బ్రహ్మవిద్యను" విని తరించవచ్చు. వినడమే గాక దీనిని అభ్యసించవచ్చును, బ్రహ్మవిద్యను పొంది ముక్తి పొందవచ్చును. మోక్షమును అందవచ్చును. అన్నది కాలక్రమేణ బలపడినది. అంతేకాదు ఏ ఒకరి ప్రవృత్తి (స్వాభావిక కర్మ) అయిన వారి వారి "స్వస్వభావ-సుస్వరూప కర్మాచరణ"ల ద్వారా నే తప్పించి, కేవల పుట్టుక వర్ణం వలన సాధ్యపడదని ధృవపడినది. ప్రవృత్తి వర్ణమునకు రాచబాట ఏర్పడినది. వేదవాదము బలపడినది- త్రయీధర్మం ఏర్పడినది.

శూద్రులు కూడా దేహదారులే -"తస్మాత్" దేహం జ్ఞాన విజ్ఞాన "సంభవమ్ అని మహాభారతం స్పష్టపరచినది. అంతేకాదు "కర్మ క్రియ విశేషేణ చాతుర్వర్ణం ప్రతిష్ఠితం" అని కూడా ప్రవచింపబడినది.

శరీరం కేవలం ''కర్మ'' అని చాటినది గీత. కేవలం ''కర్మ'' వలన మాత్రమే కాదు ''కర్మ''తో పాటు ''గుణం'' కూడా - చాతుర్వర్ణ్య వ్యవస్థ ఏరుడుటకు ప్రవృత్తి పరమైన''గుణకర్మలు'' రెండూ కారణమని మొదటిగ స్పష్టపరచబడినది గీతలోనే. కేవలం శరీరం(కర్మ) వర్ణ వ్యవస్థకు కారణమనిగాక ఆత్మిక(గుణం)కూడ ఇందుకు అనివార్యమన్నది గీత- పుట్టుక(శరీరం) వర్ణ కారణం కాదని తేలిపోయింది.

అంతేకాదు కర్మాణి ప్రవిభక్తాని-స్వభావ ప్రభవైర్గుణైః అని ధృవీకరిపబడినది. పరిచర్యాత్మకం కర్మ- ''శూద్రస్యాపి స్వభావిజం'' సమాజమున గల ప్రతీ ఒక వ్యక్తి ''గుణకర్మలు'' అనే రెండిండింటిని కలిగియుండునని స్పష్టపరచబడినది. స్వస్వభావ సుస్వరూప స్వకర్మాచరణ ధర్మమును- ప్రతిపాదించినది.

ఋగ్వేదమునన-పురుష సూక్తంలో ''చాతుర్వర్ణ వ్యవస్థ ''

బ్రాహ్మణస్యముఖ బాహూ రాజన్యకృతః

ఊరుంతదస్యచ ప్రద్యోం శూద్ర అజాయతే-''ఋగ్వేదం''. విరాటపురుషుని శిరస్సు నుండి బ్రాహ్మణులు- బాహువులు నుండి క్షత్రియులు తొడల నుండి వైశ్యులు- పాదముల నుండి- శూద్రులు ఉద్భవించిరి.

వేదము-''త్రిగుణాత్మకమే'' చతుర్విధ గుణం అందులోనూ చెప్పబడలేదు. చతుర్విధ గుణము ప్రతిపాదించబడలేదు కారణం ''త్రైగుణ్య విషయావేదా'' అనిచెప్పబడినది. అయితే విరాట పురుషునికి ఎవ్వరైన చేతులతో నమస్కరించి- తొడల్ని- వొంచుకొని-చివరికి పాదాలవద్ద ప్రణమిల్లనిదే వారివారి జీవితాల్లో ముక్తి మోక్షం సంప్రాప్తం కద.

మూడుగుణాలలో- మూడు స్వభావాలు - మూడుకర్మలు మూడు వర్ణాలు ఏర్పడతాయి తప్ప నాల్గవ గుణం స్వభావం లేకుండా నాల్గవ కర్మ ఎలా ఏర్పడగలదు. అందుకే జాతయతే ''వర్ణసంకరః'' వర్ణసంకరం అని వార్యమని చెప్పబడినది గీతలో.

ఇందువలన- ఉన్న త్రయీవిధ వర్ణాలలో- మిశ్రమం వర్ణమనేది తటస్థించును. తప్ప ప్రత్యేక వర్ణమేమి గూడు కట్టుకొనలేదు. వర్ణ సంకరులు శూద్రులు అని ఎచట గీతలో తెలుపబడలేదు- అయితే త్రయీవిధ కర్మిష్టులలో గుణకర్మ ప్రవృత్తులలో శూద్రులకు కేవలం ''పరిచార్యాత్మక కర్మ'' అని చెప్పబడింది. ఆత్మికమైనది కర్మ త్రయీగుణాత్మకమే కాగలదు. చతుర్విధ గుణమంటూ లేదుకద. సంక గుణకర్మ ప్రవృత్తి తప్పించి.

త్రయీవిధ కర్మలలో-''పరిచర్యాత్మక కర్మ'' కాని కర్మ ఏది-''కర్మ బ్రహ్మోద్భవం ''శరీరం కేవలం కర్మ'' ఈ రెండింటికి దూరంగ నిలవ గల కర్మలేముండును. అంతేకాదు-''శరీరం జ్ఞాన విజ్ఞాన సంభవం'' వైశ్యుని తామసిక ప్రవృత్తిని శూద్రునికి ఆపాదించబడినది. ఏ ప్రవృత్తిని కలిగినవారు కూడా మోక్షార్హులేనని పాపయోని సంభవులు. ఎల్లరికి కూడా ''దైవానుగ్రహం'' దక్కునని గీతా ప్రమాణం. విశ్వాత్మదైవిక అభివ్యక్తం సంభవం.

మాంహిపార్థ వ్యపాశ్రిత్యయేపిస్యుః పాపయోనయః
స్త్రీయో వైశ్యాస్థధా శూద్రాస్తేపి పరాంగతమ్(9-32)

వైశ్యులు శూద్రులు కూడా ఒకే కోవకు చెందిన పాపయోని సంభవులు ఇచట- పాపయోని -సంభవుల పుట్టుకలు- పాపపు పుట్టుకులు అని అనటం వారు కష్టతరమైన శారీరక కర్మలనొరించెడి వారు అన్న అర్థమే తప్ప వేరేమికాదు పాపమును చేసిన వారేమికాదు. వీరు కాయ కర్మ కష్ట కర్మ పాపకర్మ అని అర్థము ఇప్పటికి ''పాపము'' చేసిన కారణముగనే కష్టమైన కాయకర్మలు సంప్రాప్తమగునన్న విశ్వాసనమ్మికలున్నవి.

''మమయోని ర్మహత్బ్రహ్మ'' -తననుండి ప్రభవించినవి తనకు సంక్రమించినవి కర్మలు ఇవి పాప జనకాలగ ఉండుననుటలో అర్థమే లేదు. బ్రహ్మమే స్వరూపంగ ఉండగలకర్మ ఎన్నటికి పాపం కానేకాదు. పాప కారణము కాదు. ఎల్లరికి పుట్టుక కారణం బ్రహ్మమేకదా। జన్మకు ఆదిపునాది బ్రహ్మం. పుట్టుక ఎలా పాపసంభవము కాగలదు-''జన్మ కర్మచ మేదివ్యం(భ.గీ.)''

ఉన్నవి త్రయీావిధ గుణ కర్మ ప్రవృత్తులే గనుక-వేదమతం. నాల్గవ గుణ కర్మ ప్రవృత్తిని అంగీకరించదు. ఇందువలన- శూద్రులకు వేరే ప్రవృత్తి ఈ మూడింటిని మించినది లేక తక్కువతోనుండునది ఉండుననుట కుదరదు

వీరెల్లరికి- ఒక ప్రవృత్తిని అంటగట్టి ''శూద్రత్వం'' అని పిలిచిన వారికి ఈత్రయీావిధ ప్రవృత్తులంటేనే వారికి ఏమి తెలియదని భావించాలి. సంకర గుణ కర్మ ప్రవృత్తి వీరిదనుటను కాదనవసరం లేదు ఏ ఒకరైన వీరితో పాటు సమాజమున త్రయీావిధ గుణ కర్మ ప్రవృత్తులను కలిగి ఉందరనుటను కాదనటానికి లేదు.

ఇందువలననే-''పుట్టుక వర్ణం'' శూద్రవర్ణంలో జన్మించిన- గౌతముడు సత్యకాముడు- జాబాలి- దాల్బుడు -మొదలగువారు- ప్రవృత్తి వర్ణం మేరకు బ్రహ్మ విజ్ఞానా ధికారులై మనగలిగారు బ్రహ్మజ్ఞానం ప్రవృత్తి పరమైనది- అప్రయత్నముగ పట్టు వడునని బ్రహ్మ సూత్రం చెప్పకనే చెప్పింది. చిత్త సంస్కృతి లేనివారి నెవరినైన అల్పులని పిలచిన కాదనటానికి లేదు కారణం సత్+అసత్=''చిత్'' ఇటువంటి చిత్‌ను కలిగి లేనివారు సంస్కారం లేనివారు కాగలరు.

ఇందువలన-''హీన ప్రవృత్తి'' అనేది ఒరుల వలన ఆపాదింపబడినదే తప్ప సహజసిద్ధి ప్రాకృతిక గుణంకాదు. ప్రవృత్తులు బ్రహ్మోద్భవాలు నీచ ప్రవృత్తి అనేది లేనే లేదు ఉండదు ఉండగలది తామసిక ప్రవృత్తి ఒకవేళ వీరికి ఆపాదించిన- వీరు అందగలది సంకరగుణ కర్మ ప్రవృత్తి - అందువలన వైశ్యులనుండి శూద్రులు వేరుపడి ప్రత్యేక సంకర వర్ణముగ పిలవబడవచ్చు అయితే- సంకర గుణ కర్మ ప్రవృత్తుల్ని కలిగి ఉండనివారెవరు!

బ్రహ్మకర్మ(మానసికకర్మ) క్షేత్రకర్మ (వాచిక కర్మ) వైశ్యకర్మ( శారీరక తపస్సు) పరస్పర సంయోగం వలన సంకర గుణ కర్మ ఆవిర్భవించినది. శూద్రులే సంకర గుణ కర్ములని భావించనిచో ''చాతుర్వర్ణవ్యవస్థకు'' శాస్త్రీయమైన నాంది ప్రస్తావనలే ఉండవు. త్రయీావిధ ప్రవృత్తులు విభజింపబడనివి.

వ్యక్తులు వేర్వేరుగ కన్పించిన- వీరిలో ఏ ఒకరు ఏదో ఒక్క ప్రవృత్తికే అంకితమై ఉండరు. త్రయీవిధ ప్రవృత్తులు వీరి అంతఃకరణలో ఆవిర్భవిస్తాయి. అయితే ఏదో ఒకటి వారిలో బలీయంగ బయల్పడి బయటకు కన్పిస్తుంది ఆ మేరకు వారి వారి స్వభావాలు స్పష్టముగ బయటపడతాయి. వారి గుణములు తెలియబడతాయి. వారి కర్మలు కనిపిస్తాయి. ప్రత్యేక వర్ణాల వారిగ- పిలవబడటం జరిగిపోతూ ఉంది.

వైశ్య శూద్రులిరువురు- పాపయోని సంభవులే అని అనడం వలన ప్రవృత్తులలో వీరిరువురిని తామసిక ప్రవృత్తికి చెందిన వారనుటను స్పష్టపరుస్తుంది. తామసిక గుణకర్మ ప్రవృత్తికి దఖలు పడగల కర్మలివి.

కృషి గోరక్ష వాణిజ్యం-వైశ్యకర్మ స్వభావజమ్
పరిచర్యాత్మకం- కర్మ- శూద్ర స్యాపిస్వభావజమ్(భ.గీ.18-44)

వైశ్యకర్మ స్వార్థపూరితం - క్షత్రియ కర్మ సంబృతం బ్రహ్మ కర్మ వృద్ధి జనకము- వ్యక్తి సమాజం ఉనికి - మనుగడ వికసనలకు పర్యవసనాలు ఇవి.

మనసు కన్న బుద్ధి బుద్ధి కన్న ఆత్మ గొప్పవి. తమస్సు కన్న రజస్సు రజస్సు కన్న సత్త్వం గొప్పది. సామాజిక పరివర్తనలో పొందగల స్థానాలివి.

''కర్మ సముద్భవం'' యజ్ఞం- అని చెప్పబడినది. కర్మ బ్రహ్మం నుండి జనించగలది- మూడే గుణకర్మలు. సాత్త్విక కర్మ- రాజసిక కర్మ- తామసిక కర్మ. నాల్గవ గుణకర్మ అనేది ఉండదు. ఉండగలదే త్రయీవిధాత్మక సంకర గుణకర్మ మాత్రమే వెరశి చతుర్విధాత్మక వర్ణం వ్యవస్థ అని తెలుపబడినది.

ఈ కర్మలలో కామ్య కర్మలుంటాయి- నిషిద్ధకర్మలుండవచ్చు. నిత్య నైమిత్తిక కర్మలు యజ్ఞం- దానం- తపస్సు వంటి వైదిక కర్మలు ఇలా అనేక కర్మలుంటాయి.

అయితే ఏ కర్మ త్రయీవిధ గుణకర్మ ప్రవృత్తులలో ఏదో ఒక ప్రవృత్తిని అంటిపెట్టుకొని ఉంటుంది. గుణాతీతమైన కర్మకు గురుతే ఉండదు. ప్రవృత్తి లేని కర్మకు పట్టు దొరకదు- ప్రవృత్తి గుణం వినా కర్మకు ప్రాతిపదిక దొరకదు. కర్మ బ్రహ్మోద్భవం- మనది కర్మ జగతి- కర్మ వినా ప్రాణికి కదలికే లేదు. ఉండదు.

సాత్త్విక కర్మను మానసిక కర్మగా- రాజసిక కర్మను వాచిక కర్మగా- తామసిక కర్మను కాయకర్మగా భావిస్తాం.

ప్రభోధముతో కూడినది సాత్త్విక కర్మని పాలననొరించేది. రాజసిక కర్మని- కృషి పరమైనది తామసిక కర్మని తెలియజెప్పటంలో - ముఖ్యోద్దేశం- ఒక కర్మ వేరొక కర్మ కన్న ప్రాశస్త్యం కలదని లేదా హీనమని తెలపడం కాదు- ఏకర్మ వేరొక కర్మ నుండి విడివడదని- విభజింప బడదని నిర్ధారణ పరచుటకే అని భావించాలి.

వస్తు సంపద (కృషి) లేని పాలన (శాంతి భద్రతలు) పాలన లేని ప్రభోదం(మార్గదర్శకత్వం) ఎందుకు కొరగానివిగా ఉండగలవు- వస్తూత్పత్తికి పాలనకు- ప్రభోదానికి వేరు వేరు వ్యక్తులను సమాజమున నిలిపిన ప్రతి ఒక వ్యక్తిలో ఈ త్రయీవిధాంశాలు- తామసికాంశ- రాజసికాంశ- సాత్త్వికాంశ స్పష్టపడుతూనే ఉంటాయి. కర్మ జ్ఞానానుభవమునకు ప్రతి ఒకరు లోను కావలసినదే. (Action-Devine-Spirit)

నీ గుణం వలననే నీ స్వభావం ఏమిటో తెలుస్తుంది. నీ కర్మవలననే నీ స్వస్వరూపమేమిటో విశద పడుతుంది- నీ ప్రవృత్తి వలననే నీ స్వకర్మాచరణ స్పష్టపడుతుంది.

ఇందువలన స్వస్వభావ- సుస్వరూప- స్వకర్మాచరణ ఒక వ్యక్తిత్వ ధర్మముగ నిలుస్తుంది- స్వకీయ గుణకర్మ ప్రవృత్తిని ఇది నిలుపుతుంది.

ఇటువంటి సుస్వభావ -సుస్వరూప- స్వకర్మాచరణ "ధర్మము" . ఇటువంటి ధర్మము క్షీణించి దుస్వభావ అస్వరూప- పర కర్మాచరణ "అధర్మం" ఎప్పుడు వృద్ధియగునో అప్పుడుప్పుడు తనకు తనే పరమాత్మ అవతరించును.

యదాయదాహి ధర్మస్య- గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య- తదాత్మానం సృజామ్యహమ్(భ.గీ.4-7)

## నాల్గవ భాగం

# జీవితం

(త్రయీవిధాత్మకం)

### 3 వ ప్రకరణం

# విభాగత్రయం

ఏకాంశేన స్థితో జగత్

(భ.గీ)

"సకల చరాచర జగత్" ఒకే ఒక అంశంతో కట్టుబడి నడుస్తున్నది. ఆ అంశ ప్రకృతి పరమైనపుడు "బ్రహ్మముగ" ఆత్మ పరమైనపుడు- "పారమార్థిక సత్యము"గ నిలచును.

"ప్రకృతి-పురుషుని-సంకల్పం"-స్పష్టపరచగలవి-త్రయీవిధాంశాలు . తామసిక ప్రవృత్తి నుండి అపేక్షాంశ, రాజసిక ప్రవృత్తి నుండి ధీరాంశ, సాత్త్విక ప్రవృత్తి నుండి, వివేకాంశ జగతిని వర్ధిల్లును.(The three element of cosmic world)

మానవుడై జన్మించిన ఏ ఒకరిలో- ఈ త్రయీవిధాంశాలు గూడు కట్టుకొని ఉంటాయి. అయితే ఒక్కొక్క వ్యక్తిలో ఒక్కొక్క అంశ బాగా ప్రస్ఫుట పడుతుంది. ఏ అంశను కలిగి లేనివాడు జగతిని ఉండుననుటఅన్న ప్రశ్నే ఉదయించదు. అపేక్షాంశ వినా నరునికి ఉనికే ఉండదు ధీరాంశలేనిదే మనుగడ ఉండదు. వివేకాంశ కోల్పోయిన వికసనకు తావేలేదు.

ఈ అంశ "జీవాంశయే" ఈ జీవాంశ-తన అంశ నుండి ఏర్పడినదే- "మమైవాంశో"-జీవలోకే-జీవభూతస్సనాతన(భ.గీ.15-17) జీవలోకం- జీవభూతం రెండింటిని తన నుండి విడివడిన అంశ వలన ప్రభవించునన్నదిచట స్పష్టపడినది.

తన నుండి ఏర్పడిన తన అంశ తనదైన-తనుగ ఉండ లేదు. వేరుపడును అగ్ని నుండి వెడలిన అగ్గికణం అగ్ని అయిన అగ్నిగ ఉండలేదు జీవలోకానికి "ఆది" "పునాది" దైవాంశమే.

ఈ అంశమే (Devine-element) బ్రహ్మం నుండి ఏర్పడిన విభజన రూపమేమి కాదు. (Devision form) బ్రహ్మమే అగును. అయిన ఈ అంశ- జీవిగ- మనస్సును ఆకర్షించుకొని ఒక శరీరంలో జీవుడుగ ఉండగలదు. జీవికి చేతన దాత "పర బ్రహ్మం". జగతికి అధిపతి. (The Source of the being)

జగత్- ఏకాంశమున మన గలిగినదే. ఏకాంశ నుండి అభివ్యక్తపడిన త్రిగుణాత్మక అంశలగ- అపేక్షాంశ ధీరాంశ- వివేకాంశలనేవి ఉండును. ఇలా ఏర్పడిన త్రయావిధాంశాలు త్రయావిధ గుణకర్మ ప్రవృత్తికి లోబడి వ్యవహరించును తప్ప స్వతంత్రమైనవి కావు. ఈ ప్రవృత్తి స్వభావమునకు మించిపోదు ఇక (స్వభావోఽధ్యాత్మముచ్యతే (భ.గీ 8-31) ప్రాణి స్వభావము గతజన్మ సంస్కారము వలన సిద్ధించును.

జీవి- అంతఃకరణ నుండి శ్రద్ధ అనేది ఏర్పడును దీనికి గుణము. సంస్కారమని- శ్రద్ధఅని పిలుతురు. అశ్రద్ద- పనికిరాదు అన్నది ఆర్యోక్తి. గుణ సంస్కారాల్ని వీడినవానికి సమాజమున గురుతే లభించదుకదా। శ్రద్ధలు మూడు విధాలు. తామసిక శ్రద్ధ. రాజసిక శ్రద్ధ. సాత్త్విక శ్రద్ద. అపేంక్షాంశ(తామసిక శ్రద్ధ) కలవారు భూత ప్రేతాల్ని ఆరాధిస్తారు. (17-4)

అపేక్షాంశ - (తామసికం) దైవికాంశ నుండి ప్రభవించినదే - తామసికాంశ తామసిక అంశకు- అపేక్షాంశ (Element of service) అనుటకు సరిపోతుంది తామసికతకు ప్రధాన భూమిక అపేక్షాంశయే.

ప్రతి ఒకరిలో- సామాజిక జీవనంలో- ప్రతి ఒక అంశ- ఏదో స్థాయిలో కన్పించినను- ఎల్లరిలో సరిసమాన "అంశాలు" సిద్ధంచవు- ఒక అంశ ఒకరిలో బాగా స్పష్టపడితే మరొకరిలో వేరొక అంశ జనిస్తుంది. సమాజ ఉనికి మనుగడకు వికసనకు ప్రతి ఒక అంశ అవసరం అనివార్యం.

పరస్పర విరుద్ధాంశాలుగ నెలువగల ఈ త్రయావిధాంశాల సమతూకపు "గమనమే సమాజము." అపేక్షాంశ కూడ తనదైన ప్రత్యేకతను సమాజమున తనుపొందగలదు.

తామసికులు అపేక్షా పరులుగ ఉందురు. కృషి వాణిజ్యా-రంగాలలో ఉందురు. వీరిని వ్యామోహం-అపేక్షాంశాపరులుగ పేర్కొందురు. నిజానికి అపేక్ష (తామసికం) అనేది వస్తూత్పత్తి సేవలలోనే కాదు-వాచిక-మానసిక కర్మల యందును విస్తరించి ఉంటుంది. నిజానికి ఏ "కర్మ" అపేక్షాంశ నుండి దూరం కాలేదు.

ఉత్పత్తి పంపిణీ దార్లను-వస్తూత్పత్తి సేవలో నిమగ్నమైన వారిని అపేక్షాంశ పరులుగ ఉందురు. కారణం అపేక్షాంశ-కృషికి దఖలు పడగలది-వాణిజ్యం నెరపగలది పశు (సంపద) పాలన చేయగలది.

సహజసిద్ధమగు గుణకర్మ ప్రవృత్తి నుండి రూపొందగలది అపేక్షాంశ తామసిక జనితము.

అంశలలో ఆధిక్యత స్థాయిలుండవచ్చు వీటిని హెచ్చు తగ్గు స్థాయిలుగ అభివర్ణించుట తగనిది-దేని ప్రాధాన్యత అవసరం దానికి ఉంటుంది.

అపేక్షాంశల్ని కలవారిని అపహాస్యం చేసిన లేక అవమాన పరచిన-వస్తూత్పత్తి సేవల సముదాయాల్లో విఘాతం ఏర్పడుతుంది. సామాజిక ఉనికి మనుగడ వికసనలకే ఇది ఎసర పెడుతుంది.

ఏ అంశ ఎంత గొప్పది అన్నది ఎంత మేరకు ఇది ప్రయోజనకరమైనది ఎంత మందికి అది మంచిని - ప్రసాదిస్తుంది. అన్న దానిపై ఉంటుంది. బహుజనహితాయ బహుజన సుఖాయ దేనికైన ప్రాతిపదిక కావాలి కద.

"అంశ" నుండి "శ్రద్ధ"-"శ్రద్ధ" వలన "స్వభావం" "స్వభావం" నుండి "గుణము" "గుణము" వలన "కర్మ"-"కర్మ"ల వలన -"వ్యక్తుల ప్రవర్తనలు" బయటపడును.

ఇందులో ఏ అంశలో ఎవరు స్పష్టపడగలరన్నది వారి వారి స్వస్వభావ సుస్వరూప-స్వకర్మాచరణ-ధర్మం ఇందుకు ప్రాతిపదికగ నిలుస్తుంది. పుట్టి పెట్టి పిలిపించుకొనిన నివి స్పష్టపడవు.

త్రయీవిధాంశాలు వేర్వేరుగ మనగలిగేవికావు, సమ్మిళితమే. వ్యక్తులను విభజన పరచగలం తప్ప- ఆ వ్యక్తుల అంతఃకరణాలలో నిక్షిప్తమైయున్న అంశాల్ని ఎవరు ఏ విధముగ విభజననొందించగలరు? అయితే వ్యక్తులలో గన్పించు ఆయా అంశాల తీవ్రతను బట్టి ఒకరిలో అపేక్షాంశ- మరొకరిలో- ధీరాంశ-వేరొకరిలో వివేకాంశ ఉండుననుటలో నిర్ధారణకు వస్తాం.

అపేక్షాంశపరులు- నిత్య కర్మిష్ఠులుగ ఉందురు వీరే. నిత్యదైనందిన సమిష్టి కర్మ యజ్ఞ-సాధకులు, వీరే. శ్రమ జీవులు- శ్రామికులు- వీరే.

**ధీరాంశ :- (Element of Heroisam)**

త్రయీవిధాంశాలలో ధీరాంశ ఒకటి- మానవ మనుగడకు ఈ అంశ ప్రాతిపదికగనిలుస్తుంది. ఒకరిని అదుపు ఆజ్ఞలలో నిడగలది ''ధీరాంశ''.

ధీరాంశ- రాజసిక అంశగ పేర్కొనబడును. ధీరాంశను కలిగినవారు పాలకులు- వీరే క్షత్రియులు- ఆధునిక ప్రజాస్వామ్య రాజ్యమున ఎల్లరు పాలకులె- పాలన ప్రతినిధులు- ప్రభుత్వంలో పాలనలో పాలకులు- భాగ స్వాములు ధీరాంశతో కూడిన వారుగనే వీరుండాలి.

ధీరాంశ పరాక్రమవంతమైనది-తేజస్సుతోకూడినది పరాజయానికి అంగీకరించనది- రాజసిక కర్మ ప్రవృత్తి గలది ధీరాంశ గల కర్మ జీవాత్మ స్వరూపము కలది. మనోదుర్బలత్వాన్ని విడనాడ గలది ధీరాంశ- నిష్కామకర్మాచరణకు నిలువుటద్దముగ నుండగలది ధీరాంశ.

ధీరాంశకు- వివేకాంశకు- అభేదము కలదనుటనుగీత ప్రస్తావించినది. ధైర్యాంశ(అర్జునుడు) వివేకాంశ (జనార్ధనుడు) ఉన్నచోట సిరసంపదలు భోగభాగ్యములుండును. ధీరాంశ కర్తవ్య నిర్వహణకు ప్రధాన భూమికగ నుండును. ధీరాంశ కలవానికే వివేకాంశ సంభవించును. పరికితనం కలవాడెవరు ధీరుడుకాలేడు. వివేకతను సంతరించుకోలేడు.

ధీరాంశ వ్యక్తిలో జీవన తత్త్వవిచక్షణ- దూరదృష్టిని సంతరింపజేస్తుంది. సుస్వభావ-సుస్వరూప-స్వకర్మాచరణలోనే ధీరత్వం ఉద్భవిస్తుంది. దీనిని విడనాడు వాడు అధైర్యవంతుడు.

హృదయ దుర్బలతను పోగట్టు గలది కేవలం- ధీరాంశ మాత్రమే. ఈ అంశ కొరవడిన వారికి- ఏ జ్ఞానం పట్టుబడదు. సరికద-పైనందిన జీవితమున కూడ విజయవంతం కాలేడు. ఈ అంశను కోల్పోయినవాడు అమాయకుడు అజ్ఞాని పిరికివాడు. పనికిరానివాడు. అని పిలవబడతాడు. దేనికి అనర్హుడు అని కూడ చెప్పబడుతాడు. ''కర్మ బంధం'' నుండి తప్పించ గలది ధీరాంశ. ఈ అంశ లేకున్న వివేకాంశ ఉన్నను బంధనాలనుండి తను విడివడలేడు . వ్యక్తికి ధీరాంశ- జీవాత్మస్థాయికి తీసికొని వెళ్తుంది. అపేక్షాంశ-కేవలం జీవి స్థాయికి దిగజార్చుతుంది.

ఒక ప్రక్క సర్వ సంగపరిత్యాగము( వివేకాంశ) ను ప్రభోదిస్తూ వేరొక ప్రక్క- సత్కర్మానుష్టానం- నిష్కామకర్మచరణ (ధీరాంశ) చేయమన్నది. ఇందుకు అడ్డుగాల రాగ ద్వేషాన్ని- (అపేక్షాంశ) తొలగించుకోమన్నది.

ఎవరికైనా- జీవన్ముక్తి మోక్షం లభించడం-కేవలం పరమాత్మ( వివేకాంశ) శరణాగతిని పొందినపుడే సాధ్యం. ఇందుకు అతనికి జీవాత్మ( ధైర్యాంశ) సహకరించాలి. జీవి లో (జనుడు) జీవాత్మ( అర్జునునిగ) ప్రభవమందనిదే పరమాత్మ( జనార్ధనుని) శరణా గతిని వ్యక్తి పొందలేడు. నిత్యదైనందినము:న వీరే ధైర్యవంతులు, పాలకులుగ వ్యక్తపడతారు. సాహసికులు వీరే.

**వివేకాంశం :-**

ప్రకృతిని (Not self) పురుషుని (Self) తన అధీనంలో నిలుపుకొనగలది పరబ్రహ్మ. (Absolute Reality). జీవిని (క్షేత్రం) జీవాత్మను(క్షేత్రజ్ఞానిని) తన అధీనములో నడిపించు కొనగలది పరమాత్మ. (Supreme Sel).

పరబ్రహ్మ పర్యవసితరాగ రూప సారూప్యత కలది ''పరమాత్మ''. పరమాత్మకు ప్రతిరూపమే- విశ్వాత్మదైవికం-''దైవం''- విశ్వాత్మ దైవిక అభివ్యక్తం దైవానుగ్రహం.

త్రయీవిభాంశాలలో వివేకాంశ ఒకటి- దృశ్యజగతినందలి విషయాలను తెలిసికొన్నంత మాత్రాన అది వివేకాంశకాదు. దృశ్యాదృశ్య ప్రయోజనాల రెండింటిని విశద పరుచుకోగల విజ్ఞానమే వివేకాంశగ ఉంటుంది.

ఇందులో ఒక అంశ- అప్రధానమని- వేరొక అంశ ప్రధానమని మరియొక అంశ పవిత్రమని అనటం మనం వ్యక్తి ఉనికికి విలువ నివ్వక మనుగడను ఆశించడం మనుగడకు ప్రాధాన్యతనివ్వక, వికసనను పొందగలమనుకోవడం. ఇది వట్టి భ్రమ మాత్రమే అగును.

జన్మతః సహజ స్వాభావికత వలన సంభవించగలవే త్రయీవిభాంశాలు తప్ప ఒకరి వలన వేరొకరికి సంక్రమించ గలవి కావు. వ్యక్తులలో అంతర్గతముగ నిండిన ఏ అంశ అయిన ఎవరి వలనైన రాణించవచ్చు- వ్యక్తిలో లేని అంశము ఎంత ప్రవచించిన- రాణించదు.

అయితే ఏ అంశ అంతో ఇంతో లేని వారి జనగతిలో జీవించటానికి లేదు ఏ అంశ తనలో అతి విస్తారంగ రాణించిన ఆ అంశకు ప్రతినిధిగ తను నిలుస్తారు మిగతా అంశాలన్ని తనకు ఉప అంశాలుగ మారి ఒకే ఒక అంశకు తను ప్రతినిధి నన్న భావసామర్థ్యాన్ని పొందగలుగుతారు.

ఏ అంశ ఏ ఒకరికి పట్టువడిన- వివేకాంశ మాత్రం పట్టువడదనునది కేవలం అపోహ మాత్రమే- ఏ ''అంశ'' జన్మతః సంక్రమించగలది. ఒకరి ఉనికి వేరొకరి దృష్టిలో అల్పము కావచ్చు. అధమం కావచ్చు ఒకరి మనుగడ మరొకరికి నచ్చవచ్చు లేకపోవచ్చు ఒకరి వికసన మరొకరికి సరిపడకపోవచ్చు. ఇందుకు అంతరాత్మలలో గల స్థాయీ భేదాల అపార్థ సృష్టి కారణం కాగలదు. దృష్టిలో భేదాలే తేడాల సృష్టి కర్త.

అందుకు వారిలో గల ఈ త్రయీవిభాంశాలు శక్తి యుక్తుల పాటవం స్థాయి బేధాలే తప్ప మరేమి కావు అంశాలు- పరస్పర విరుద్ధ ప్రయోజనాల్ని ఆశిస్తుంటాయి. సంఘర్షణ పడుతూనే ఉంటాయి. సమైక్య పడుతుంటాయి.

అయితే పీటి సమతూకపు గమనమే సమాజం ఈ అంశాల్లో ప్రధానాంశముగ- వివేకాంశ- ఉంటుందనటానికి కారణం భౌతిక- ఆధ్యాత్మిక సమన్వయదీపికగ- జీవితాన్ని మార్చగల శక్తి కేవలం వివేకాంశ ఉండాలన్న నమ్మకం విశ్వాసం మాత్రమే నిజానికి ఇందుకు ఏ అంశ సహకరించక పోయిన జీవన్ముక్తి సాఫల్యతకు అవకాశమే లేదు.

వివేకాంశ సాత్త్వికాంశ-పరమాత్మ పర్యవసిత రాగరూప సారూప్యత గలది. కేవలం సాత్త్వికాంశలోనే దైవాంశగ భావిస్తూ మిగతారెండు అంశాల్ని దైవాంశాలుగ భావించకపోవడం త్రయీవిధాంశాలకు ఏకాంశ(దైవాంశ) మూలకారణం కాదని భావించడమే అవుతుంది.

వివేకాంశ- విజ్ఞాన పూరితమైనది-హేతుబద్ధమైనది జ్ఞానంతో కూడినది అతీంద్రియ నిగ్రహం కలది ఋజువర్తనం కలది అందుకు ఇది దైవాంశగ- ప్రతిబింబమై నిలచినది ఏ అంశ స్వతంత్ర ప్రతిపత్తి కలిగినది కాదు కారణం అన్నింటికి మూలం ''బ్రహ్మకర్మ త్రయీవిధాత్మకం'' వివేకాంశతో కూడిన బ్రహ్మకర్మ పరమాత్మ స్వభావంగ పరిగణించబడును. బ్రహ్మకర్మ ప్రవృత్తి-''సాత్త్వికం''.

1. లోకస్వభావం కలది అపేక్షాంశ
2. లోక సంగ్రహం కలది ధీరాంశ
3. లోకానుగ్రహంకలది వివేకాంశ

నిత్య దైనందిన జీవితమున సమాజమున వీరే మార్గ దర్శకులుగ వ్యక్తపడగలరు. మేధావులుగ పిలవబడతారు.

సామాజిక ఉనికి- మనుగడ- వికసనలకు సమాజమునందలి వ్యక్తులు శ్రామికులుగ - సాహసికులుగ- మార్గదర్శకులుగ- నిలువెత్తురూపాలలో నిలచిన మానవుడు త్రయీవిధాత్మకుడు. శ్రామిక సాహసిక మేధావి ఒకడే. జగత్ ఒకటే.

'' ఏకాంశేన స్థితో జగత్ ''

(భ.గీ.)

పంచమీ విభాగం

# ము క్తి

(భౌతికం)

1 వ ప్రకరణం

# కా మం

(అభిలాష / ఉనికి)

దర్మా విరుద్దో భూతేషు
కామోస్మిన్ భరతర్షభ

(భ.గీ.7-11)

ధర్మమునకు వ్యతిరిక్తముగ నిలచిన కామము త్యజించగలిగినది. "ధైర్యము" తామసికం-రాజసికం- సాత్త్వికం. ఈత్రయీవిధాత్మక -ఫలాపేక్షతో- కామార్థ ధర్మములను మిగుల ఆసక్తితో అనుష్ఠించినవారు రాజసిక ధైర్యవంతులు, పేర్కొనబడతగిన వారు, వీరు.

"యయాతు ధర్మ కామార్థాన్ ధృత్యా ధారయతేర్జున" (భ.గీ-18-34) ఇదే త్రయీవిధ పురుషార్థసిద్ధి. విషయాసక్తితో కర్మాచరణకడు చెడ్డది. నిష్కామ కర్మాచరణ కడు మంచిది. కర్మ బంధం తప్పించగలది, "నిష్కామ కర్మ". బంధించ గలది "కామ్య కర్మ".

కామ్య కర్మ-నిష్కామ కర్మ. కామ్య కర్మలను విడిచిపెట్టడానికి వలను పడదు. వీటి నుండి నివృతుడై జీవన్ముక్తి పరుడుకావాలి.

సత్+మార్గ = సత్-వాక్యం-వలె సత్-కామం విసర్జనీయం కాదు. అయితే శోధన ధ్యాస కలదిగ "కామం" ఉంటుంది. ఇది కూడనిది. అయితే కోరికకు మూల ప్రాతిపదిక కామం. ఇటువంటి కామ్యకర్మ నుండి బయటపడటం మానవ జీవితంలో దుర్లభం. అందుకు ఇందుకు కారణముగ నిలువగల సంకల్పమును త్యజించమన్నది. ఇది కష్టసాధ్యమే అందుకే అలవడ గలది. కర్మయోగం అలవరచుకోగలది, కర్మ సన్యాసయోగం.

"కామము" భోగమునకు పర్యాయపదము - కామోప భోగపరమః (16-11) కామ భోగేషు(16-16) కామరాగ బలాన్వితః(17-5) కామము అనగా కేవలం స్త్రీ పరముగనే గాక అనేక అర్థములను కలిగి ఉంటుంది.

చెవి-చర్మము-కన్ను-జిహ్వ-నాసికం నుండి శబ్ద స్పర్శ రూపరసగంధము అనుభవించుట "కామము". కేవలం స్త్రీ పురుష సంయోగము కామం అనుట అసుర ప్రవృత్తికి చెందినది.

"అసత్యం ప్రతిష్ఠంతే జగదాహుః- అనీశ్వరమ్
అపరస్పర సంభూతం- కిమన్యాత్కామహైతుకమ్" (భ.గీ.16-8)

జగత్ అసత్యం (Without a moral basis) అ ప్రతిష్ఠితం (Without basis) అనీశ్వరం (No God) కేవలం కామం వలన(కోరిక) జనించినది ఇది భౌతికవాదం ఇది విసర్జనీయం.

జీవిని వినాశనమొనర్చు- త్రయావిధ నరక ద్వారములలో క్రోధం లోభంతోపాటు కామాన్ని విడిచిపెట్టాలి (భ.గీ. 16-21).

కామం-పర్యవసితరూపం-అభిలాష. ఆసక్తికి మార్గగామి. ఉనికికి మూల ప్రాతిపదిక. దుర్మార్గమును నిషేధించగలం తప్ప-సన్మార్గమును నిషేధించవలను పడదు. ఆసక్తి జీవన్ముక్తికి జీవ ధాతువు. నిజమైనందిన జీవితమున వ్యక్తి నిలువెత్తు రూపమును నడిపించ గల మహత్తర శక్తి. వ్యక్తి-ఉనికికి- ముఖ్యం ఆసక్తి అభిలాషలే. వ్యక్తి మనుగడ నాశించినటువంటి ఉనికిని ఖండించలేం. వికసన అందని మనుగడను ఖండించగల తప్ప వికసను(ముక్తిని) కాదనలేం. విషయాసక్తి బంధముతో కూడినది-"బంధము" అనేది కామము వలన సంభవిస్తుంది. అయితే ఈ కామ్య కర్మ నిష్కామ కర్మగ మారిన కర్మ బంధవిమోచనం జరుగుతుంది .

"ధర్మావిరుద్ధో భూతేషు, కామోస్మి- భరతర్షభ" (7-11) ప్రాణులలో ధర్మమునకు వ్యతిరిక్తముగ నిలువని కామమును(కోరిక) నేను.

ఆత్మలో చిత్తమును స్థిరముగ నెలుపుకొని-కోరికల సముదాయం నుండి(కామం) నివృత్తుడగువాడే-యోగసిద్ధిని పొందగలరు.(6-18) కామ సంకల్ప వర్జితా. కామ(కోరిక) ''సంకల్పమును'' (అభిలాష) విడనాడమన్నది తప్ప మనల్ని విడిచి ఉండని కోరికను (కామం) విడనాడమనలేదు.

''సంకల్ప ప్రభవాన్ కామాన్త్యక్త్వా సర్వానశేషతః'' (భ.గీ.6-24) సంకల్పము వలన కలిగెడి కోరికలనన్నింటిని పూర్తిగ విడిచి పెట్టాలి. మనస్సువికలత వలన సంకల్పములు ప్రభవించును. మనస్సు చపలత్వము కలది. కోరికలనెలా విసర్జించడం.

''చంచలం హిమనః కృష్ణ ప్రమాథి బలవద్ధృడమ్'' (భ.గీ.6-34) మనో నిశ్చలత-సిద్ధించదగిన యోగము .మనసు అస్థిరమైనది. చపలత కలది. బలవధృడమైనది.

''అసంశయం మహాబాహాం మనో దుర్నిగ్రహమ్ చలమ్
అభ్యాసేనతు కౌంతేయ వైరాగ్యేణచ గృహ్యతే'' (భ.గీ. 6-35)

మనో నిగ్రహం-సులభ సాధ్యం కాదు. మనస్సు చంచలమైనది, అయిన అభ్యాస కలిమి వలన వైరాగ్య బలిమి వలన, మనోనిగ్రహం సాధ్యమే.

సహజమైన ''సత్'' జీవించ గలది. ''తృష్ణ'' వేరు-''కామం'' వేరు-జీవి జీవాత్మ స్థాయికి చేరుకొన అభిలషించిన ఆ కోరికను తప్పుగ భావించవలనుపడదు. కోరిక-వాంఛ- అభిలాష-తృష్ణ విదలించకోబడగలవి వదలించుకోబడగలవి కావు. కోరికల్ని నిష్కామ పరచుకోవడమే నిష్కామ కర్మయోగం-కర్మ సన్యాస యోగము.

త్రయీవిధ పురుషార్థ సిద్ధిలో ''కామం'' ప్రాథమికమైనది. ప్రథమస్థానంలో ఉండగలది. కామం వినా అభిలాష జనించదు అభిలాష వినా జీవికి ఉనికి ఏర్పడదు.

''కామ్య కర్మము'' మనిషిని పట్టి బంధించి వేస్తుంది. నిష్కామ కర్మ మనిషికి నిలువెత్తు రూపాన నిలువవృతుంది. అందువలననే కామం నిష్కామ కర్మగ మారినచో జీవన్ముక్తిని సిద్ధింప చేసిన త్రయావిధ పురుషార్థ సిద్ధిలో ఇది ఒకటిగ ఉంటుంది.

త్రయావిధ-గుణకర్మ ప్రవృత్తి నుండి విడివడిన మానవుడు ఈలోకంలో లేడు-స్వర్గలోకమున ఉండడు(భ.గీ.18-40). వ్యక్తి ఉనికికి తావిచ్చిన- కామమును (కోరిక) వ్యక్తపరచిన వ్యక్తిలో శోభన వ్యాసను పెంచి పెద్దదిగజేసే కామ్య కర్మలను నిష్కామ పరచుకోవాలి. నైష్కర్మ్య సిద్ధిని పొందగలగాలి. అది ముక్తి ప్రదం.

బుద్ధిని ఆత్మవైపు గాక మనసు వైపు మరలించిన తటస్థపడగలవి. దురభిమాన మదమాత్సర్యాలు.(Full of impocracy excess pride arrogance)

జీవునికి స్థూల శరీరమున బాల్యం-యవ్వనం-వార్ధక్యం అను మూడు దశలు సంభవించును. ''కౌమారం-యవ్వనం-జరా'' (భ.గీ.) బాల్య దశలోనే ఇచ్ఛా అభిలాషలకు రూపకల్పన జరుగుతుంది.

ప్రథమ జీవిత దశ -కౌమారం-జ్ఞాన విజ్ఞానములను ఆర్జించగల బ్రహ్మచర్యాశ్రమమిది. బోధనల్ని జీవన్ముక్తి పాఠాల్ని విని అవగాహన తెచ్చుకోగల అభిలాష కోరికలు జనించేది ఈ దశలోనే. బ్రతుకు బంగారు బాట కావటానికి- భవిష్యత్ భాగ్యోదయానికి ప్రథమ సోపానం కౌమార జీవిత దశ. ఆశలకు ఆలోచనల నిలయమయిన జీవితదశ. అధ్యయనం- ఇంద్రియ నిగ్రహం ప్రధానాంశలుగ బ్రహ్మచర్యాశ్రమం వర్ధిల్లుతుంది.

అధ్యయనం -విధివిహిత ధర్మం- ఆత్మసమర్పణ -వైరాగ్యం-సాధన చతుష్టయమంటారు. ఆత్మ సమర్పణలో అంతర్భాగమే వైరాగ్యము గాన - చతుర్విధ సాధన చతుష్టయమని గాక అధ్యయనం-విద్యుక్త ధర్మం ఆత్మ సమర్పణ త్రయావిధ జీవన్ముక్తి సాధనాలుగ ఇవి ఉండగలవి. ఇందులో ప్రథమ సాధనం అధ్యయనం- బాల్యదశలో బ్రహ్మచర్యాశ్రమమున వర్ధిల్లు మహత్తరాంశం- జీవన్ముక్తి పథం.

పంచమీ విభాగం

# ముక్తి

(భౌతికం)

2 వ ప్రకరణం

# అర్థం

(ప్రయోజనం / మనుగడ)

ఆర్తోజిజ్ఞాసు రర్థార్థీ
జ్ఞానీచ భరతర్షభ
(భ.గీ. 7-16)

''అర్థం'' అనకేవలం ''డబ్బు'' కాదు- ధనకనక వస్తు వాహన సమృద్ధి రస్తు అని ఆర్యోక్తి. ఐశ్వర్యం- సిరిసంపదలు- శ్రేష్ఠత్వం- ఉత్సాహం- బలం- వీటితో ఉన్న ఏ వస్తువు లేదా ప్రాణియైన- అది దైవ తేజస్సులో ఒక అంశం నుండి వెలువడినవే కాగలవు. (భ.గీ.10-14)

ఎచట యోగీశ్వరుడైన శ్రీకృష్ణపరమాత్మ- ధనుర్ధారియగు అర్జునుడు ఉండునో అచట సంపద విజయం- ఐశ్వర్యం- ధృడతరమగును.

''యత్రయోగీశ్వరః కృష్ణో - యత్రపార్థో ధనుర్ధరః
తత్ర శ్రీర్విజయోర్భూతి - ర్ధృవానీతిర్మతిర్మమ'' (భ.గీ. 18-78)

అర్జునుడు- జనార్ధనుడు- ఉన్నచోట- సిరి సంపదలు విజయం వర్ధిల్లగలవు. యోగీశ్వరుడు కృష్ణుడు- కర్మానుసారి అర్జునుడు. ఒకరు సంకల్ప సన్యాసి ఒకరు నిష్కామ కర్మాచరణ శీలి. కర్మిష్టి ఒకరు, కర్మయోగి ఒకరు ఇరువురు ఉన్నచోట విజయం తథ్యం. యోగ మనస్తత్వము- కర్మానుష్టానం ఉన్న వ్యక్తులకు నిత్య శుభాలు. విజయం తథ్యం.

విశ్వం- సుదర్శన రూపం కలది. అర్జునుడు జనార్ధనుని తన పూర్వరూపం ధరించమని అర్థించాడు. ''కిరీటినం- గదినం- చక్రహస్తం (భ.గీ. 11-46)'' కీర్తి సంకేతనమైన కిరీటిని బలపరాక్రమ విరాసి గదతో భౌతిక శక్తి ప్రవాయిని- చక్రంతో ప్రత్యక్షం కావాలి.

త్రయీవిధ-పురుషార్థ సిద్ధిలో అర్థంకూడ ఒకటి అని చెప్పబడినది- కారణం అర్థం సకల సంపత్తికి మూలం. అర్థం వినా జీవితం వ్యర్థం. అర్థం పరమార్థ సాధనం. అందుకే తన చతుర్విధ భక్త జనులలో అర్థం- ఆశిస్తూ- తనను పూజించే పుణ్యాత్ములు ఉన్నారు అని చెప్పబడినది.

ఆర్తో జిజ్ఞాసు అర్థార్థీ'' (భ.గీ.7-16) ధనార్జన కూడదని చెప్పక- అన్యాయ మార్గాల ద్వారా ధనార్జన చేయువారు కామ క్రోధ పరాయణులని ఆశా పాశ బద్ధులని ఖండించడం జరిగింది. ఈ ఇహంతే- కామ భోగార్థమన్యాయేనార్థ సంచయాన్(భ.గీ. 16-12).

భౌతిక వస్తు సముదాయం-''పత్రం-పుష్పం-ఫలం-తోయం''(భ.గీ) తనకు సమర్పణ జరగాలి. ఆర్థిక సంపదలోని విభాగాలే ఇవి అన్యథా కావు. దక్షిణ (అర్థం) లేని యజ్ఞం. తామసిక యజ్ఞంగా జమకట్టబడినది. (17-13).

కామం(అభిలాష- ఇచ్ఛ) ప్రథమ పురుషార్థమైనది అర్థం/అభిరుచి/ ఇష్టం ద్వితీయ పురుషార్థమైనది. ధనసంపదలు కామ్యవస్తు సముదాయం అయినప్పటికి వీటిని నిష్కామ పరచిన ఆ వ్యక్తి జీవన్ముక్తికివి కామ్య కర్మలగనిలచిన ఆవ్యక్తి శాంతికి సుఖములకు తోడ్పడతాయి.

విశ్వ సందర్శన యోగమున జనార్థనుడు-అనేక దివ్యాభరణాలు దివ్యమైన పెక్కు ఆభరణములతో కూడినివాడని వర్ణించబడినది(భ.గీ.11-10) ధన వు శోభాయ వ యాన వు న కు ప్రతీక. సుంద ర వ యం అర్థ వు. భోగభాగ్యములకు సంకేతం( భ.గీ.1-32).

ధనమదాన్వితులు- కామభోగవితృష్ణలో మునిగినవారు జీవన్ముక్తులగ నుండలేరు. అహంకారం- బలం- దర్పం కామంవీటిని ప్రేరేపించని సంపద ధనము అనివార్యం జీవన్ముక్తికి అత్యంతావశ్యకం.

యజ్ఞదాన తపములు పవిత్ర కర్మలు- ధనహీనుడు దానమొనరించ గల ధేముంటుంది. ''దానము'' ధనం వలన గాని సంప్రాప్తం కాదు.

భౌతిక జీవనంలో- ప్రధానాశయాలుగనే యజ్ఞ దాన తపములు వ్యక్త పడతాయి. ఉపయోగకర భగవతారాధన- సమర్ధనీయమే (The seeker for wealth) అర్ధాశక్తి- ఆరాధనతో నిండిన విశ్వం నుండి రూపొందిన వస్తు సంపదను (పత్రం/ పుష్పం/ తోయం) తనకు నైవేద్యమిడమనను.

అర్ధం అనేది దీనికిది- ఒక పరమార్ధముగ నిలవదు. ఇదొక జీవన వినిమయ రూపం. జీవన్ముక్తి తారకం. ఎవరికైన దీనివలననే భాధాకర జీవితం నుండి విముక్తి లభించును. సుఖ సంతృప్తి కర జీవనమే ఆరాధనకు ప్రధాన వేదిక. అర్ధం వినా ఇది సాధ్యపడనే పడదు. ఆర్తునిగ- అర్ధార్ధిగాకాక జిజ్ఞాసిగా- జ్ఞానిగ మనగలిగిన వ్యక్తి జీవన్ముక్తికి అతి చేరువలో ఉండగలడు. అని ధృవపరచబడినది.

అర్ధ సంపాదన- జీవన భద్రతకు ఉపాదితమే తప్ప ఇదొక జీవిత లక్ష్యముగ నిలువదు. అర్ధమే పరమార్ధమనుకొనే వారికి ఇహలోక పరలోకాల సంగతేవారి దరికి రాదు .కేవలం వారు భౌతిక సుఖాలకు బానిసలగ ఉండగలరు.

భౌతిక సంపదను కాదనలేము- అర్ధాశక్తి- ఆరాధకులుందు రనటాన్ని సమర్ధించాలి. అంతేకాదు- ఆహారంలో శ్రేష్టమైన ఆహారం- పుష్టికరమైన ఆహారం అసంతృప్తికర ఆహారం- స్పష్టపరచు అర్ధాసక్తిని కాదనలేము.

ధనమునకు విలువలేని కామ్య కర్మలుండవు సంపదలు లేని దానానికి రూపమే ఏర్పడదు యజ్ఞదాన తపఃకర్మలు జీవన్ముక్తికి అవసరము.

అర్ధమునకు ప్రత్యేకమైన శాశ్వతరూపము అంటూ ఏమీుండదు పరస్పరం వ్యక్తులు అందించి మరల పొందే ''వస్తు సేవల వినియమ రూపం'' ఇది సమాజ పరంగ సిద్ధిస్తూ- సమాజము నందలి వ్యక్తుల ప్రయోజనాలలో ఇది సాధనంగ నిలుస్తుంది.

అభిలాష- ఇచ్ఛ(కామం) ప్రధమ పురుషార్ధ సాధనం. అభిరుచి ఇష్ట(అర్ధం) రెండవ పురుషార్ధం. అర్ధాసక్తి విషయాక్తిగనే చెప్పబడినది- దేనికైన ఆసక్తి ప్రమాదకరము . అనాసక్తితో అన్నింట వ్యవహరిస్తూ- కర్మ పటిష్టతను విడనాడక నిష్కామ కర్మతో- జీవన్ముక్తిని పొందగలగాలి.

ప్రథమ పురుషార్థ సాధనం ఇచ్ఛ+అభిలాష(కామం). జీవిత త్రయీదశలలో ప్రథమ దశ కౌమారంలో సాధించబడాలి. ఈ శారీరక దశలోనే అభిలాష ఇచ్ఛట ప్రయోజనత్వాన్ని సిద్ధింపజేసుకొంటాయి. ద్వితీయ పురుషార్థసిద్ధి సాధనలో జీవిత త్రయీదశలో రెండవదశ, యవ్వనంలో సాధించబడాలి. అభిరుచి ఇష్టం తగిన రూపాల్ని సంతరించుకొంటాయి.

ప్రథమ దశలో అంకురించిన- ఇచ్ఛా- అభిలాష, రెండవ దశలో ఇష్టం- అభిరుచిగ పరిణామం చెందుతాయి. ఆశ్రమ ధర్మాలగ వీటిని పిలవదలచిన మొదటి దశ బ్రహ్మచర్యాశ్రమం. రెండవ దశ-గృహస్థాశ్రమ ధర్మం. ఈ ఆశ్రమమునే ''అర్థం'' అనేది బహుళార్థ సాధనగా, గృహస్థునకు వినియోగ పడుతుంది. ముక్తి నిచ్చి తోడ్పడుతుంది. కామం- అర్థం- వీటి పరమార్థమేమిటో తెలిసికొని- తెలివితేటలతో నిజమైనందిన జీవితమున వెలుగ గల దశ- గృహస్థాశ్రమ ధర్మముగ నిలుస్తుంది.

ద్వితీయ జీవిత దశ-యవ్వనం. ఈ దశలో జీవుడు స్థూల శరీర జ్ఞానంతో పాటు సూక్ష్మశరీరమన ఏమిటో విశదపరచుకొనలగడు.

ప్రథమ జీవితదశలో అంకురించిన ఇచ్ఛ- అభిలాష, ఈ దశలో స్పష్టమైన రూపంలో పరిణామం చెందుతుంది. భౌతిక సంపదల నాకట్టుకొనినగాని- యవ్వనదశలో-గల స్థితి గతుల నధిగమించి ముక్తిని సాధించ వలను పడదు. కుటుంబ వ్యవస్థ పర్యవసిత రూపమే గృహస్థాశ్రమం. యవ్వన దశలో వ్యక్తికి సంక్రమించగలది అర్థ సంపాదన. అర్థం వ్యర్థమని దీనితో పని లేదని భావించిన మరుక్షణం, గృహస్థాశ్రమానికి గురుతు ఏర్పడదు. త్రయీవిధ పురుషార్థ సాధనలో ''గృహస్థాశ్రమంలో'' కనీసం ఇహ మాత్ర ఫల భోగాపేక్షలని కూడా కలిగి ఉండరాదని- ఏ స్మృతులలోను ఎచటనూ పొందుపరచి ఉండలేదు.

అర్థం- జీవి- ఉనికికి - మనుగడకు- ఊపిరినిచ్చి జీవన్ముక్తి ఆశయానికి ప్రాణం పోస్తుంది.

పంచమీ విభాగం

# ముక్తి

(భౌతికం)

3 వ ప్రకరణం

# ధర్మం

(స్వకర్మ / వికసన)

ధర్మసంస్థాపనార్థాయ
సంభవామియుగేయుగే

(భ.గీ.4-8)

"త్రయీవిధ" సహజ ప్రాకృతిక శక్తుల మేరకు ఏర్పడగల "త్రయీవిధ ప్రవృత్తుల" మేరకు-"త్రయీవిధ జీవన" సాధనాలంకురిస్తాయి. "త్రయీవిధ ధర్మములు" నెలకొంటాయి.

జీవిత ఉనికికి / అభిలాష / (కామం)-జీవన మనుగడకు / ప్రయోజనం/ (అర్థం)-పేర్కొనబడినవి. జీవన్ముక్తికివి రూపాలు- వీటికి ముఖ్య భూమికగ నిలువగల జీవికి వికసన (ధర్మం) స్వకర్మ అవసరం అనివార్యం.

త్రయీవిధ పురుషార్థ సాధనాలలో ఇది ఒకటి. ధర్మం జీవితానికి అనివార్యమే గాక అవసరం. ఆత్మసంజనితం పరిపూర్ణ జీవిత రూపమే (Complete life) ధర్మం. ధర్మం పరిపూర్ణ జీవిత విధాన నిర్దేశిని. సామాజిక జన జీవన సూత్రం ధర్మం- సరియైన ఆచరణాత్మక నియమమే ధర్మం.

ప్రవృత్తిపరమైనదే ధర్మం- న్యాయనిర్ణేత- వ్యాఖ్యాత- ధర్మం ఒకరు చెపితే వేరొకరు వినేది ధార్మి బోధన- తప్ప ధర్మముగ నిలవదు. వ్యక్తిగత సామాజిక అపరిష్కృత సమస్యలనంటనిది. నెత్తినిపెట్టుకొని ఊరేగిన అది ధర్మముగా నిలవదు. "ధర్మం" "జీవన సత్యం" తప్ప బోధన కాదు.

అందుకు "ధర్మం" అనవేరేమి కాదు- "స్వస్వభావ- సుస్వరూప స్వకర్మాచరణే "ధర్మం". ఇందుకు వ్యతిరిక్తముగ నిలచినదే అధర్మం.

నీ స్వభావానికి నీ స్వరూపానికి నీ స్వకర్మకు నీవు- ఉనికి మనుగడ వికసనలనందించిన అది నీ ప్రవృత్తి ధర్మం. ఇందుకు విరుద్ధముగ ప్రవర్తించిన అది అ ప్రవృత్తి పరమైన అధర్మం. ధర్మమే స్వర్గం అధర్మమే నరకం.

గత జన్మ సంస్కార నిబద్ధత కలది. ఇది ప్రవృత్తి ధర్మమునకు పర్యవసిత రూపమనుటలో అతిశయోక్తి లేదు. మానవ జీవన నివృత్తిధర్మం. ప్రవృత్తి ధర్మం. నియమబద్ధ మార్గ దర్శకం-''ధర్మం''. ఇదొక ఆదేశిక దృక్పథం . జీవనస్వరూపం కలది (Mode of being). స్వభావం స్వరూప స్వకర్మ ''ప్రవృత్తి ధర్మం'' (Energitic spirit of life).

''ధర్మం'' అనే పదానికి బహు బంగుల- బహు అర్థములు ఉన్నవి. ధర్మక్షేత్రం (Centre of devine activity) కులధర్మం (Caste basis) అధర్మం అనాచారం - అనాచారమన ఇచట అరాచకం (భ.గీ.1-41) జాతి ధర్మం (భ.గీ.1-43) స్వధర్మం (భ.గీ.2-31) ధర్మయుద్ధం (భ.గీ.2-31).

ఇచట సంఘర్షణ పడటం కూడ- ఒక ధర్మమని అభిభాషించబడినది. అతని ప్రవృత్తి అతని ధర్మం- విద్యుక్త కర్మను ఇచట ధర్మముగ చెప్పబడినది. అభివ్యక్త పడగలది. అత్యున్నతమైనది- ధర్మం-వేద ధర్మం- త్రయీ ధర్మమనబడును.

ప్రవృత్తి ధర్మమును పాటించని వాడు- పాపమును పొందగలడు (భ.గీ.2-33) తప్పొప్పుల మధ్య జరిగేది ధర్మయుద్ధం ధర్మా ధర్మముల. మధ్య సంఘర్షణ ప్రవృత్తికి ఎదురు తిరగడం అధర్మం. దీనిని- అనుసరించడం ''ధర్మం''.

ఎవరికైన తన ఆత్మ ధర్మమే(స్వీయ ప్రవృత్తి) తన స్వధర్మముగ ఉంటుంది- ఉండాలి. శారీరక ధర్మం మేరకు నందిన వ్యక్తికి జీవన్ముక్తి పట్టువడదు కారణం- మనో బుద్ధ్యహంకృతి లోను కాగలది- శారీరక ధర్మం గుణకర్మ ప్రవృత్తి మేరకు ప్రవర్తించ గలది ఆత్మిక ధర్మం.

అనుష్ఠించినదే ''ధర్మం'' - అనుష్ఠించడమన ఆచరించడం సెజధైనందిన జీవిగ వ్యక్త పడటం- తన స్వకీయాత్మ ధర్మం మేరకు తను స్పష్టపడిన తనకదే స్వర్గమగును. పరధర్మం మేరకు ప్రవర్తించిన అది తనకు నరకమగును.

స్వధర్మమే ఆచరణీయం-పరధర్మం అనుసరణీయం కాదు అన్నది - ధర్మము ''సుస్వభావ సుస్వరూప-స్వకర్మాచరణ'' తప్ప ఇతరులచే చెప్పించుకొనేది కాదు. తన ఆత్మ ధర్మమే తన స్వధర్మం ''స్వధర్మని ధనం శ్రేయము'' ప్రవృత్తి వినా జీవి అనేది రూపొందదు. గుణకర్మ ప్రవృత్తి వినా జీవి- జీవించదు.

గుణకర్మ ప్రవృత్తిని ఏ ఒకరు అధిగమించి నిలవలేరు- గుణకర్మ ప్రవృత్తి నుండి ఉద్భవించినదే స్వకర్మ-స్వధర్మం.

సాధన సంస్కారాలు చతుర్విధాలగ చెప్పబడిన నిజానికి, త్రయావిధ సాధన సంస్కారాలే జీవిత త్రయావిధ దశలకు తగినట్లుగ ఉండగలవి.

జీవిత ప్రథమ దశలో అధ్యయనం

జీవిత ద్వితీయ దశలో విద్యుక్త ధర్మ నిర్వహణ

జీవిత తృతీయ దశలో ఆత్మ సమర్పణ

జీవిదశలు త్రయావిధాలు-''కౌమారం-యౌవ్వనం-జరా''(భ.గీ)

వేదాలు త్రయావిధాలే ''ఋక్సామయజుర్వేవచ''(భ.గీ) పురుషార్థాలు త్రయావిధాలే. ''ధర్మ కామార్థాన్'' (భ.గీ.18-34) ముక్తి మార్గాలు మూడే కర్మ-జ్ఞాన-భక్తి మార్గాలు-గుణకర్మల్ని మూడుగనే తెలియజెప్పిరి. భావములు మూడే- త్రిభిర్గుణ మయైఃభావైః(భ.గీ.7-13).

''సత్త్వ-రజ-స్తమ ఇతి గుణాః''(భ.గీ.14-5).జీవన పరిణామ క్రమంలో- ''జీవితం'' త్రయావిధాత్మకమే. త్రయావిధ గుణకర్మ ప్రవృత్తులే. ఎచ్చట నాల్గవది అనేది తెలుపబడలేదు. ప్రస్తావించలేదు ఇక వర్ణవ్యవస్థలో నాల్గవ వర్ణం ఎలా స్థిర రూపం దాల్చగలదు. ''జాయతే వర్ణసంకరః'' అనేది సంభవించినపుడే బ్రహ్మమే త్రివిధము- ఓం తత్సత్ ఇతి నిర్దేశో బ్రాహ్మణ స్త్రివిధః(భ.గీ.17-23).

అందుకు బ్రహ్మ చర్యాశ్రమం- గృహస్థాశ్రమ ధర్మం- వాన ప్రస్థాశ్రమధర్మం- ఇవే సమర్థనీయులు చారిత్రకాంశాలుగా ఉండగలవు. సర్వజనామోదాలు కాగలవు. సన్యాసాశ్రమం తంత్ర శాస్త్రమున తెలుపబడలేదు. జైమిని దీనికి అంగీకరించలేదు. నిజానికి వాన ప్రస్థాశ్రమమున లభించని ఆత్మ సంజనిత ధర్మం అంటూ ఉండదు. ''జీవన్ముక్తి'' త్రయావిధాత్మకం- లోకవేః త్రయావిధాత్మకం కద లోకత్రయం ప్రవ్యదితం- మహాత్మాన్(భ.గీ.11-20).

కోరిక (కామం) వలన జీవితేచ్ఛ- అర్థం వలన జీవన మనుగడ - ధర్మం వలన జీవన్ముక్తి మార్గం అలవడును. ఎల్లరు గుణాన్వితులే. గుణహీనులని తామసికులను పేర్కొనడం జరిగింది, తప్ప నిజానికి గుణకర్మ ప్రవృత్తి వినా జీవికి ఉనికి - మనుగడ- వికసన సిద్ధించనే సిద్ధించదు. స్వభావ నియతం కర్మ-జ్ఞానస్య కారణం కర్మ తప్పుకొనడమెలా. అనుభవాత్మకం కావలసినదే ''సంభవామి''.

కౌమార దశలో- జీవన సత్యం, యవ్వన దశలో- వ్యవహారిక సత్యం, వార్ధక్య దశలో, పారమార్థిక సత్యం ప్రతి ఫలించాలి. ఆత్మ ప్రకాశమే ప్రవృత్తి. (Nature is levelation of spirit) సత్ నుండి ఏర్పడినది పవిత్రోదయం(eternity existent) . శుద్ధవ్యవహారికార్థమున దీనినే ధర్మమని వచింతురు. ప్రకాశించ గలది ప్రవృత్తి దివ్య భావం కలది దైవికం. త్రయావిధ ధార్మిక ముక్తి దాయకం జీవితం.

''మానవాత్మ త్రయావిధం'' త్రయావిధ జీవిత దశలు త్రయావిధ జీవన్ముక్తి పదాలు త్రయావిధ. ఆత్మ సంజనిత సంకల్పవములను ప్రభవింపజేస్తాయి. త్రయావిధ ధార్మిక జీవన మార్గాల్ని సుగమం చేస్తాయి. ఇందుకే విశ్వాత్మ దైవికం అభివ్యక్తమగును.

''పవిత్రాణాయ సాధూనాం- వినాశాయా చదుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే''(భ.గీ.4-8).

సస్వభావమును పరిరక్షించాలి. దుస్వభావమును అణచిపెట్టాలి. జీవన్ముక్తి ప్రసాదిని విశ్వాత్మ దైవిక అభివ్యక్తం దైవానుగ్రహ ''అవతారం''

''సంభవామి యుగే యుగే''

# షష్టి విభాగం
# మోక్షం

(ఆధ్యాత్మికం)

## 1 వ ప్రకరణం
## ఆత్మ సమర్పణ

(మనోబుద్ధ్యహంకృతి నివారిణి)

సర్వ సంకల్ప సన్యాసీ

(భ.గీ.6-4)

మనోబుద్ధ్యహంకృతి నివారిణి ''ఆత్మసమర్పణ''. సత్ సాంగత్యం సత్ దర్శనం. సత్‌సంబంధము. సత్ మార్గం.(సన్మార్గము) సత్యవాక్. సత్ వాక్యము సత్‌లోకము. సత్ బుద్ధి. సత్-సంకల్పం. సత్- ప్రామాణికము.

ఓం తత్ సత్ ఇతి నిర్దేశో
బ్రహ్మణః త్రి విధః స్మృతః (17-23)

'' ఓం''-పరబ్రహ్మవాచకం. సృష్టి కర్త. ''తత్'' అనిర్వచనీయతత్త్వము. అద్వితీయమైనది. ''సత్'' పారమార్థిక సత్యం . ఓం-తత్-సత్ (Tripple designation of Brahmam) నామ త్రయమిది. ఇందువలననే బ్రహ్మజ్ఞానులు, వేదములు, యజ్ఞములు, రూపొందినవి.

''సత్'' పారమార్థిక సత్యముగ నిలుస్తుంది. సత్యసంధత అవసరం. సత్ సంకల్పం మంచిది. సత్ మంచికి మరోపేరు నిరూపించుటకు అందగలది. అయితే నిరూపించుటకు వలను పడది-''తత్'' ప్రత్యక్షముగ కాక పరోక్షంగా అవగాహనకు రాగలది. పరబ్రహ్మం పరమాత్మ(Supreme self)

''సత్'' ఆసక్తి-మమత్వము వలన తన రూపాల్ని ధరించుకుంటుంది. సత్ సాంగత్యము సత్ సంకల్పం అయితే సంగమమును సంకల్పమును విసర్జించమని చెప్పబడినది. ''మద్భక్తస్సంగ వర్జితః'' (భ.గీ. 11-55) సర్వ సంకల్ప సన్యాసి, మోక్ష సిద్ధికి అర్హుడు కర్మలను విడనాడు వాడు ఈ లోకములో కన్పించనివాడు. జీవి కర్మ బద్ధుడు కద.

ఇందువలన ''సత్యంగత్వమును'' విడచి పెట్టవలను బడదు అయితే- దీనిని నిస్సంగత్వము చేసికోవాలి- సత్సంకల్పమును నిస్సంకల్పముగ నిలుపుకోవాలి. మోక్ష సాధన మార్గాలివి. ఇందుకు తనమనో బుద్ధ్యహంకృతిని బయటకునెట్టి ఆత్మ సమర్పణ భావమును (Realisation of self) అలవరచుకోవాలి. ''మచ్చిత్తస్సర్వ దుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి అథచేత్త్వమహంకారా న్నశ్రోష్యసివినజ్ఞ్యసి (భ.గీ.18-58)'' పరమాత్మాను గ్రహం వలననే సర్వ భాదల నుండి విముక్తి కాగలవు. మనో బుద్ధ్యహంకృతి వలన కాదు. ఇందువలన నీ జీవితం కొనసాగిన - జీవన్ముక్తిని మోక్షమును అందలేవు పొందలేవు.

అయితే మనోబుద్ధ్యహంకృతిని మొదలంటూ నరికివేద్దామన్న కుదరదు- మానవ దుర్బలతకునిది బీజరూపం. హెచ్చరికను పొందిన గాని వ్యక్తి నుండి వదలనిది ఇది. అర్జునుడు మానసిక దుర్బలుడై మనోబుద్ధ్యహంకృతి పరుడై కార్పణ్యదోషేనహత స్వభావుడై నాడు. హెచ్చరిక ఇది.

''క్షుద్రం హృదయ దౌర్బల్యం
త్యక్త్వోత్తిష్ఠ పరంతప''(భ.గీ.2-3)

అధైర్యముపడకు- ఇది తగనిది- మనోదుర్బలతను విడనాడు నేను, నా బంధు వర్గమను అహంకృతిని విడనాడు. కర్తవ్యమొనరించ సిద్ధపడు . జనార్ధనుని హిత బోధవలన తన ''మనోబుద్ధ్యహంకృతిని'' విడనాడిన అర్జునుడు ఉవాచ.

''శిష్యస్తేహం శాధిమాం
త్వాం ప్రపన్నమ్'' (భ.గీ.2-7)

''నీకు శిష్యుడను''-శరణుపొందిన నన్ను- ఈ ప్రకారముగ నడుచుకొనుము. అని శాసించుము. ఇలా అర్జునుడు అనగలగటం తన మనోబుద్ధ్యహంకృతి నుండి విడివడి- ఆత్మసమర్పణ భావమును అలవరుచుకొనినపుడే సాధ్యము మనోబుద్ధ్యహంకృతిని విదలించుకోవచ్చు. వదిలించుకోలేము. ''పరమాత్మ శరణాగతి'' జీవన్ముక్తి ప్రసాదము ''మోక్షము'' సర్వాధర్మాన్ పరిత్యజ్య ''మామేకం శరణం వ్రజ '' అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః(భ.గీ.18-66). కేవలం ''కర్మ జ్ఞాన సముచ్ఛయ''.

పాప పరిధి నుండి నిన్ను తప్పించలేని త్రయీవిధ మనోబుద్ధ్యహంకృతిని, గుణకర్మ ప్రవృత్తిని అధిగమించి విశ్వాత్మదైవిక అభివ్యక్తం పరమాత్మను శరణు పొందు పాప విముక్తి మోక్షప్రాప్తి కలుగుతున్నది. పరమాత్మ అభయ ప్రధానం ''మాశుచః'' శోకించవద్దు దైవశరణాగతి మోక్షం(Right Knowledge of the self)

''మనోబుద్ధ్యహంకృతి'' వగానవృడి సహజ గుణమైనను నిస్సంగత్వమున దీనిని విదలించుకొననిచో ఇది వినాశనానికి మార్గమిడును.

మనోబుద్ధ్యహంకృతి- విషయాసక్తిని కలిగిస్తుంది. కోరికకు దారి నిడుతుంది. కోరిక కోపకారణం. కోపం కొరవిలాంటిది. అవివేకం, మరపు కారణం- బుద్ధి నాశనం. బుద్ధి చెడిన అన్నింటికి బద్ధుడై, వినాశనం కొని తెచ్చుకొనును. ''స్మృతి భ్రంశా ద్బుద్ధినాశో

బుద్ధినాశాత్ ప్రణశ్యతి''(భ.గీ.2-63)

అందుకు నిగ్రహంతో- మనోబుద్ధ్యహంకృతిని విడనాడి రాగ ద్వేష రహితుడై మెలగిన తను విషయాసక్తిని నిస్సంగత్వము అనుభవిస్తున్నను తను మనశ్శాంతిని పొందగలడు.(Peace of mind) నిష్కామమన- కర్తృత్వ నివారిణి

ఆత్మవశ్యైర్విధేయాత్మా- ప్రసాదమధిగచ్ఛతి (భ.గీ. 2-64)(Free from attraction and aversion) మనో బుద్ధ్యహంకృతి పరిధిని దాటి, విషయాసక్తిని తను అనుభవిస్తున్న- వాటి పై ''ఆసక్తిని'' నిష్కామపరిచిన జీవన్ముక్తి లభించి ఆత్మశాంతిని అందగలడు.

నిర్మమో నిరహంకారఃసశాంతి మధిగచ్ఛతి (భ.గీ. 2-71)

ద్రవ్యము వలన సాధిపబడు యజ్ఞముకన్న- జ్ఞాన యజ్ఞము గొప్పది ఇటువంటి జ్ఞానాన్ని మనోబుద్ధ్యహంకృతి పరిధినుండి నీవు దాటగలిగిన గాని లభించదు ఈ ఆత్మ జ్ఞాన సాధనకు ఆత్మ సమర్పణకు అది పునాది ప్రమోది- పరమాగతి.

''తద్విద్ధి ప్రణిపాతేన- పరిప్రశ్నేన- సేవయా

ఉపదేక్ష్యంతితే- జ్ఞానం- జానినస్తత్త్వ దర్శినః''(భ.గీ.4-34).

రాజసిక జ్ఞాని- తామసిక జ్ఞాని సాత్త్విక జ్ఞాని అని గాక ''తాత్త్విక జ్ఞానికి'' సాష్టాంగ నమస్కారం చేయాలి. వినయ విధేయతల్ని ప్రదర్శిస్తు ప్రశ్నించి తెలుసుకోవాలి. అంతిమ జీవిత లక్ష్య సాధనం మోక్షం ఇది (Supreme goal) శరణాగతి వినా లభ్యం కాదు. పరమాత్మే శరణాగతికి మోక్ష ప్రాప్తికి మూలవిరాట్. దానికి నీవు తప్పక తగిన సేవల నొనరించాలి ఇలా చేసినచో వారు నీకుజ్ఞానమును ఉపదేశించ గలరు. ఎవరైతే తన మనో బుద్ధ్యహంకృతిని విడనాడిచరించ గలరో వారే ఈ చర్యల నన్నింటిని చేయగలరు. జీవన్ముక్తిని పొంది మోక్షమును అందగలరు.

''మన్మనాభవ మద్భక్తో - మద్యాజీమాంన మస్కురు
మామే వైష్యసి యుక్త్వైవ- మాత్మానం- మత్పరాయణః'' (భ.గీ.9-34)

''మనోబుద్ధ్యహంకృతి''- జీవన్ముక్తి రూపకారణం తప్ప- మోక్షసాధన రాజవముగ నిలవదు- ''విశ్వాత్మదైవికం'' గుణకర్మ ప్రవృత్తిలోనే వ్యక్త పడుతుంది. ''పరమగతిని'' మోక్షము ప్రసాదిస్తుంది. పరమాత్మ శరణాగతికి సిద్ధపరుస్తుంది.

''కర్మ'' సుముఖతలో ''కర్మ'' విముఖతను సాధించగల ప్రజ్ఞను తను కల్గి ఉండాలి. ''యోగవమంటే'' పనుల(కర్మల) నందలి ''నైపుణ్యం'' ప్రజ్ఞాపాటవం తప్ప వేరేమి కాదు. ''యోగః కర్మసు కౌసలమ్''.(భ.గీ.2-50)

మోక్షము అమృత స్వరూపము కలది- ''పరబ్రహ్మము'' నెరిగిన లభించగలది. ''పరబ్రహ్మం''. సత్ అనిగాని ''అసత్'' అని గాని చెప్పబడదు- ఉన్నదనిగాక లేనిదని గాక- ఉన్నది లేనిది ''పరబ్రహ్మం''- ఉండి లేనిది లేక ఉన్నది ''పరమాత్మ''. ''అనాది మత్పరం బ్రహ్మనసత్తన్నాసదుచ్చతే'' (భ.గీ. 13-13). సత్ అనిగాని అసత్ అని గాని చెప్పబడనిది ''పరబ్రహ్మం''. అనాది. మనో బుద్ధ్యహంకృతిని నివారించి, గుణకర్మ ప్రవృత్తిని నివృత్తి పరచిన తనకు విశ్వాత్మదైవికం అభివ్యక్తమగును. అమృత స్వరూపమగు, ''మోక్షము'' ఆత్మ సమర్పణ వలన ''పరమాత్మ శరణాగతి'' వలన లభించును.

''త్వమేవ శరణం గచ్ఛ
సర్వ భావేన భారత'' (భ.గీ.18-62).
తత్ప్రసాదాత్పరాంశాంతిమ్
స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్(భ.గీ.18-62)

సర్వ విధవముల హృదయస్థుడగు ఈశ్వరుడే శరణాగతి ''పరమాత్మానుగ్రహమే'' సర్వోత్తమగు శాంతిని మోక్షమును లభింప చేయలగది.

## షష్ఠి విభాగం
# మోక్షం
( ఆధ్యాత్మికం)

## 2 వ ప్రకరణం
# నిష్కామ కర్మాచరణ
(గుణకర్మ ప్రవృత్తికి నివృత్తి)

పద్మ పత్ర మివాంభసా

(భ.గీ.5-10)

గుణకర్మ ప్రవృత్తికి నివృత్తి నిష్కామ కర్మ. ప్రతి ఒక వ్యక్తికి "గుణకర్మ ప్రవృత్తి" ప్రకృతి సహజ సిద్ధమగునది. అలవడునది- అలవసరచుకొన గలిగినది కాదు. తన గుణకర్మ ప్రవృత్తికి సరిపడు వృత్తి( వర్ణం) తనకు అమరిన తన జీవితం స్వర్గమయం. సరిపడని వృత్తి( వర్ణం) తనకు లభించిన తన జీవితం నరక మయం.

"స్వస్వభావ- సుస్వరూప- స్వకర్మాచరణ ధర్మం" - గుణకర్మ ప్రవృత్తికి గురుతు. "ధర్మాచరణవ్యక్తి ముక్తి సాధన రూపమే తప్ప- మోక్షదాయికముగ నిలవదు. ధర్మాచరణే - కర్మాచరణ. యీ కర్మాచరణ- సుస్వభావ- సుస్వరూప స్వకర్మాచరణ ధర్మముగ నిలవాలి- జీవన్ముక్తిది సరిపోవును. మోక్ష సాధనకు ఇంతకు మించిన "నైష్కర్మ సిద్ధిని" పొందాలి. ఆత్మ సమర్పణకు - అంకితం కావాలి.

పరిపూర్ణ మానవ వ్యక్తిత్వ వికసనకు "జీవితం(Life) ముక్తి (Salvation) మోక్షం" (Realisation) తీర్చిదిద్దగలవు. నిష్కామ కర్మాచరణ శీలిగ నిలుపగలవు.

భౌతికాధ్యాత్మిక భూమిక- రూపిక- దీపిక .జీవితం-కేవలం- జీవన్ముక్తి వలన జీవిత పరమార్థం నేరవేరబడదు. "మోక్ష సాధన "అందిపొంద గలిగినపుడే పరిపూర్ణ మానవుడు ఉద్భవిస్తాడు. విశ్వాత్మదైవికం గుణకర్మ ప్రవృత్తికి నివృత్తి. నైష్కర్మ సిద్ధి కాగలది.

"గుణకర్మ ప్రవృత్తి" వలన సంభవించగల మాయను( భ్రమను) తొలగించగలది నిష్కామ కర్మ. ఇందువలన త్రిగుణభావ మోహిత జగత్ నుండి బయటపడు మోక్ష సాధనమిది. దీని వలన "విశ్వాత్మ దైవిక అభివ్యక్తం" సిద్ధించగలదు.

బ్రహ్మణా ధ్యాయ కర్మాణి- సంగంత్యక్త్వా- కరోతియః
లిప్యతేన సపాపేన- పద్మ పత్రమివాంభసా(భ.గీ. 5-10).

తామరాకు నీటిపై తేలియాడినను తను నీటిచే అంటబడదు- నీటితో తడవదు. అలానే కర్మల నొనరిస్తున్న- ఆ కర్మ లందాసక్తిని మమత్వమును విడనాడి కర్మ సన్యాసిగను కర్మయోగిగను ఉండాలి. గుణకర్మ ప్రవృత్తి మాయాజాలం నుండి బయట పడాలన్న నివృత్తికి నిష్కామ కర్మ తప్ప వేరేమార్గం లేదు.

కర్మలను విడచిపెట్టడం సాధ్యంకాదు. అయితే ఇందుకు కారణముగ నిలవగల సంకల్పమును త్యజించిన గుణ కర్మ ప్రవృత్తి మాయాజాలం మనకు అంటదు. కర్మల్ని విసర్జించినవాడు సన్యాసి కాబోడు, సంకల్పసన్యాసి నిజానికి కర్మ సన్యాసిగ ఉండగలడు. నిష్కామ కర్మచరణ శీలి ఇతడే, గుణకర్మ ప్రవృత్తికి నివృత్తి ఫలాసక్తిలేని విద్యుక్త ధర్మ నిర్వహణ. (Gita insitsts not on renounriation of action but on with renounciation of desire) (భ.గీ)(18-2). పరుడే మోక్షసాధకుడు.

వ్యక్తుల పతనానికి ఉన్నతికి కారణం- వారి వారి ఆత్మలే తప్ప వేరేమి కాదు '' ఉద్ధరే దాత్మనాత్మానాం''(భ.గీ.6-5) గుణకర్మ ప్రవృత్తినిమించిన నిష్కామ కర్మ యోగసాధన వలన తప్పించి ఇది సాధ్యంకాదు. ద్వేషాను రాగాలకు గురికానివాడు నిష్కామకర్మయోగి. గుణకర్మ ప్రవృత్తికి మించి వ్యవహరించ గలవాడు జీవన్ముక్తి పరుడు. కర్మసన్యాసి.

గుణకర్మ ప్రవృత్తి- జీవన్ముక్తి నివ్వగలదు. మోక్షమును ప్రసాదించలేదు. ఇందుకు విశ్వాత్మదైవికం అభివ్యక్తము కావాలి. పరమాత్మ సంకల్పాం అనుగ్రహం లభించాలి . స్వాభావిక ప్రాధాన్యతలకు గుణకర్మ ప్రవృత్తి సంతరించుకుంటుంది. అయితే ఈ ఆధిక్యతలు సహజ ప్రవృత్తుల సఫలీకృత సాధన మార్గాలు - వ్యక్తి సమాజానికి ఇవి సౌభాగ్య దీపికలు తప్ప, ఏ ఒకరికో ఇవి ఆధిక్యత అధికారం కట్టబెట్టడానికి కాదు.

''స్వకర్మణా తమభ్యర్చ్యం- సిద్ధిం విందతి మానవః'' (భ.గీ.18-40) సిద్ధిని పొందుటం నిష్కామకర్మాచరణ వలననే- మోక్షప్రాప్తి దైవశరణాగతి వలన జరుగును. అయితే మోక్షప్రాప్తికి మొదటి మెట్టు- నిష్కామకర్మ. కర్మ సన్యాసయోగమే. తన గుణకర్మ ప్రవృత్తి మేరకు స్వభావ-సుస్వరూప-స్వకర్మాచరణ ధర్మము వ్యక్తపడును. జ్ఞానయోగ్యతారూప సిద్ధిని కేవలం తన గుణకర్మ ప్రవృత్తి మేరకే పొందగలడు. ''స్వకర్మ నిరతస్సిద్ధిం'' (భ.గీ.18-45).

నిజమైనందిన జీవితమున వ్యక్తి తనగుణ కర్మ ప్రవృత్తి మేరకు సమాజమున నిలువెత్తు రూపమై నిలచినంత మాత్రానా తను సిద్ధిని పొందగలిగిన తను మోక్షమును అందగలడనుటకు ఆస్కారం లేదు. ''సిద్ధివేరు'' ''మోక్షం వేరు''. సిద్ధి భౌతికం. మోక్షం ఆధ్యాత్మికం.

''స్వభావనియంత కర్మ'' (భ.గీ.18-4) శరీరం కేవలం కర్మ. కర్మల నొనరించక వ్యక్తి ఉనికి మనుగడ వికాసనలకు తావేలేదు. అయితే ఆ కర్మల పరిధిలో గుణకర్మ ప్రవృత్తి మేరకు తను ఉనికి మనుగడ వికాసనలందిన అంతటితో తనకు జీవన్ముక్తి లభించినను, తను మోక్షము అందగలడనుటకు అవకాశమే లేదు. ఆచరణ వలన ముక్తి(Salvation) అనుగ్రహం వలన మోక్షం(Realisation) లభించును.

''గుణకర్మ ప్రవృత్తి'' అనేది ప్రకృతిమయా జాలం. ఇందుండి వ్యక్తి బయటపడి మెలగాలి త్రయావిధ గుణకర్మ ప్రవృత్తులకు నివృత్తి జరగాలి. ఈ మేరకు ఇందువలన వీటి నుండి నిష్కామముతో విడివడాలన్నది వీటికి తగుల్కొనిన తరించడానికి అవకాశమే లేదన్నది ''తత్త్వం'' (Philosophy)

అందుకు గుణకర్మ ప్రవృత్తిని నివృత్తిగ, నిష్కామ కర్మ ప్రతిపాదించ బడినది. ఏ ఒకరు తన గుణ కర్మ ప్రవృత్తిని అధిగమించి నిలువలేడు విడనాడ లేడు. అందుకు తన కర్మలను నిష్కామ పరచుకోవాలి. నిష్కామకర్మ యోగిగ- కర్మయోగిగ తను మారిన. గుణకర్మ ప్రవృత్తి అనే ప్రకృతి మాయ తనకంటదు. కర్మ త్యాగం కర్మయోగం- కర్మ సన్యాసం శ్రేష్ఠమైనది. (భ.గీ. 5-2).

బ్రహ్మణాధ్యాయ కర్మాణి-సంగంత్యక్త్వా-కరోతియః
లిప్యతేన సపాపేన-పద్మ పత్రమివాంభసా(భ.గీ. 5-10).

తామరాకు నీటిపై తేలియాడినను తను నీటిచే అంటబడదు- నీటితో తడవదు. అలానే కర్మల నొనరిస్తున్న- ఆ కర్మ లందాసక్తిని మమత్వమును విడనాడి కర్మ సన్యాసిగను కర్మయోగిగను ఉండాలి. గుణకర్మ ప్రవృత్తి మాయాజాలం నుండి బయట పడాలన్న నివృత్తికి నిష్కామ కర్మ తప్ప వేరేమార్గం లేదు.

కర్మలను విడచిపెట్టడం సాధ్యంకాదు. అయితే ఇందుకు కారణముగ నిలవగల సంకల్పమును త్యజించిన గుణ కర్మ ప్రవృత్తి మాయాజాలం మనకు అంటదు. కర్మల్ని విసర్జించినవాడు సన్యాసి కాబోడు, సంకల్పసన్యాసి నిజానికి కర్మ సన్యాసిగ ఉండగలడు. నిష్కామ కర్మచరణ శీలి ఇతడే, గుణకర్మ ప్రవృత్తికి నివృత్తి ఫలాసక్తిలేని విద్యుక్త ధర్మ నిర్వహణ. (Gita insitsts not on renounriation of action but on with renounciation of desire) (భ.గీ)(18-2). పరుడే మోక్షసాధకుడు.

వ్యక్తుల పతనానికి ఉన్నతికి కారణం- వారి వారి ఆత్మలే తప్ప వేరేమి కాదు "ఉద్ధరే దాత్మనాత్మానాం"(భ.గీ.6-5) గుణకర్మ ప్రవృత్తినిమించిన నిష్కామ కర్మ యోగసాధన వలన తప్పించి ఇది సాధ్యంకాదు. ద్వేషాను రాగాలకు గురికానివాడు నిష్కామకర్మయోగి. గుణకర్మ ప్రవృత్తికి మించి వ్యవహరించ గలవాడు జీవన్ముక్తి పరుడు. కర్మసన్యాసి.

గుణకర్మ ప్రవృత్తి- జీవన్ముక్తి నివ్వగలదు. మోక్షమును ప్రసాదించలేదు. ఇందుకు విశ్వాత్మదైవికం అభివ్యక్తము కావాలి. పరమాత్మ సంకల్పం అనుగ్రహం లభించాలి . స్వాభావిక ప్రాధాన్యతలకు గుణకర్మ ప్రవృత్తి సంతరించుకుంటుంది. అయితే ఈ ఆధిక్యతలు సహజ ప్రవృత్తుల సఫలీకృత సాధన మార్గాలు - వ్యక్తి సమాజానికి ఇవి సౌభాగ్య దీపికలు తప్ప, ఏ ఒకరికో ఇవి ఆధిక్యత అధికారం కట్టబెట్టడానికి కాదు.

స్వీయ గుణకర్మ ప్రవృత్తిలో నిలచినగాని వ్యక్తులకు సమాజమున శాంతి సౌభాగ్యాలనేవి సిద్ధించవు. ఇందుకు వారి స్వాభావికతల ''సన్మార్గానికి'' హాని సంభవించరాదు. సంభవించిన మరుక్షణం ''సంభవామియుగేయుగే''.

మనోబుద్ధ్యహంకృతి వ్యక్తిలో గూడుకట్టుకొని ఉంటుంది. దీనికి నివారణ జరిగి గుణకర్మ ప్రవృత్తి నివృత్తిని పొందిన గానివిశ్వాత్మద్వైవికం అభివ్యక్తపడదు. జీవన్ముక్తి సిద్ధించదు. జీవన్ముక్తి ఒక్కటే మానవ జీవిత ధ్యేయం కాదు ఇంతటితో వ్యక్తి పరిపూర్ణ జీవితం అవతరించదు ''మోక్షప్రాప్తి'' వినా మానవ ఉనికి మనగడ వికసనలకు పరమార్థమే ఉండదు. ప్రామాణికత లభించదు.

కర్మసన్న్యాసి-సంకల సన్న్యాసి- ఒకరు కాదు. సన్న్యాశాశ్రమంలో వీరికి పనిలేదు. ఉన్న చోటనుండి కర్మల నందలి సంకల్పమును త్రోసిరాదని నిలచి వీటిలో నిగ్రహం నిలపవచ్చును.

మానసికవైరాగ్యం సన్న్యాసాశ్రమానికి దగ్గరదేమి కాదు. వానప్రస్థాశ్రమ ధర్మానికి ఇదేమి మించి ఉండదు. ఆత్మసమర్పణ పర్యవసిత రూపమే మానసిక వైరాగ్యం.

అందుకే వేద సంహితాలలో ''జైమిని'' సన్న్యాసాశ్రమముతో పనిలేదని తెలిపాడు. ఈ ఆశ్రమ ధర్మమును నిషేధించాలన్నాడు. బాధరాయణుడు కూడా పరివ్రాజకత్వం సన్న్యాసత్వం వ్యక్తికి తప్పని సరి ధర్మంగ నిలవదన్నాడు. ఇదొక ఐచ్ఛిక విషయమన్నాడు.

చాందోగ్యోపనిషత్‌లో త్రయీవిధాశ్రమాలే చెప్పబడినవి. నిజానికి ఏ ఆశ్రమమునకు చెందక పోయిన ఎవరైనా జీవన్ముక్తిని పొందవచ్చును.

స్థితప్రజ్ఞుడు నిష్కామకర్మయోగి-సర్వసంకల్పసన్న్యాసి ఎల్లరు విముక్తి స్వరూపాలే. ముక్తి పరులే. మోక్షప్రాప్తికి అర్హులే. పరమాత్మానుగ్రహానికి పాత్రులే. మోక్ష సాధకులే.

షష్ఠీవిభాగం

# మోక్షం

( ఆధ్యాత్మికం)

3 వ ప్రకరణం

# పరమాత్మ అనుగ్రహం

(విశ్వాత్మ దైవిక అభివ్యక్తం)

"మామేకం శరణ వ్రజ"

(భ.గీ.18-66)

దృశ్యా దృశ్య జగతి పరివ్యవసిత రూపం- "మోక్షం" విశ్వాత్మదైవిక అభివ్యక్తం"అనుగ్రహం"శరణాగతి-"మోక్షం." పరమాత్మ అనుగ్రహం ఇది విశ్వాత్మఅద్వైవికమునకు అభివ్యక్తపడదు. అద్వైవికం-"అనాత్మ" దైవికం-"ఆత్మ".

"అనంత దేవేశ జగన్నివాస "త్వమక్షరం"
సద సత్తత్పరం యత్" (భ.గీ.11-37).

"సదసచ్చాహమర్జున". సత్+అసత్+అహం-అనేది ముక్తి ప్రదము "సద్సత్త్పరం యత్"-సత్+అసత్+పరం అనేది-మోక్ష ప్రదము ఈ "అద్వితీయమే" మానవ పరిపూర్ణ సృష్టికి మూల విరాట్గ నిలుస్తుంది. "కర్మ+జ్ఞాన+సముచ్ఛయ".

అనంత బాహుం "శశిసూర్యనేత్రం"
పశ్యామిత్వాం-దీప్తహుతాశవక్త్రం
స్వతేజసా విశ్వ మిదం తపంతమ్(భ.గీ. 11-19).

స్వభావము నుండి-"గుణము"-గుణం వలన "కర్మ"-కర్మవలన "ప్రవర్తన' దీని వలన నిజదైనందిన జీవితమున స్పష్టపడునది-"కర్మ జ్ఞానానుభవం" "మోక్షం"-విశ్వాత్మదైవికం అభివ్యక్తం-భగవత్ప్రార్థనానుగ్రహం మోక్షం.

స్వీయం స్వాభావిక కర్మల నిర్దేశిని- స్వస్వభావ - సుస్వరూప స్వకర్మాచరణ ''ధర్మం''. ధర్మ పదమే- పరమాత్మానుగ్రహ దీపిక.

1. నిరంతర ప్రక్రియాత్మక విధి-''కర్మ''-మనోబుద్ధ్యహంకృతి కలది
2. నిరంతర గమన రూపం-''జ్ఞానం''-గుణకర్మ ప్రవృత్తి కలది
3. నిరంతరం ధర్మనాత్మకం-''అనుభవం''-విశ్వాత్మదైవికముగ నిలుచునది

కర్మ(జీవితం) జ్ఞానం(దీపిక) అనుభవం(మోక్షం). ''కర్మ జ్ఞాన సముచ్ఛయ''- ఒక పక్షి రెండు రెక్కలు. మానవత్మా త్రయీవిధాత్మకం.

ఇందువలన - జీవితానికి మనోబుద్ధ్యహంకృతి భూమికగ ఉంటుంది. ముక్తికి- గుణకర్మ ప్రవృత్తి- మూలప్రాతిపదికగ నిలుస్తుంది. మోక్షమునకు- విశ్వాత్మదైవికం- మహాలవిరాట్గ వెలుగుతుంది. ఉనికి నివ్వగలది మనోబుద్ధ్యహంకృతి - మనుగడ నివ్వగలది గుణకర్మ ప్రవృత్తి వికసన కలుగజేయ గలది విశ్వాత్మ దైవికం ''పరమాత్మానుగ్రహం'' మోక్షం.

మనోబుద్ధ్యహంకృతి- నివారిణి- ఆత్మ సమర్పణ భావం గుణకర్మ ప్రవృత్తికి నివృత్తి నిష్కామ కర్మ- విశ్వాత్మ దైవిక అభివ్యక్తం ''దైవానుగ్రహం''. ఇందువలన - జీవితం+ ముక్తి = జీవన్ముక్తి పొందటమే జీవిత పరమార్ధముగ నిలవదు. ఇంతకు మించిన మోక్షం దైవానుగ్రహం అవసరం- జీవితం ముక్తి- అనేవి మన చేతులలోనే ఉంటాయి.

కారణం కర్మాధికారులం మనమే ''కర్మణ్యేవ్యాధికారస్తే'' అయితే మోక్షం పరమాత్మాను గ్రహం కర్మ ఫలదాత. విశ్వాత్మదైవిక అభివ్యక్తం. మన ఆదీనంలో ఉండదు. ఫలితం దైవాధీనం. కర్మ మన ఆధీనం. జీవితం ప్రతిఫలించిన, ముక్తి సంభవించును. ముక్తికి మార్గము సుగమము, అయిన మోక్ష ప్రాప్తి కలుగును. పరమాత్మానుగ్రహం ఇది.

మనోబుద్ధ్యహంకృతి- మనల్ని విడవదు. అయితే దీనిని విదలించుకోవాలి. లేనిచో మనలను- నిర్వీర్యం చేస్తుంది. గుణకర్మ ప్రవృత్తి

కడు సహజమైనది. మనల్ని వదలదు. అందుకు దీనిని నివృత్తి పరచుకోవటం తప్ప మనకు గత్యంతరం ఉండదు. లేనిచో ఇది మనల్ని గెంతిస్తుంది. నిష్కామమొనరించుకోవాలి. నిష్కామ కర్మాచరణ శీలిగ ఉండాలి.

ఇక విశ్వాత్మ దైవికం-దైవ సంకల్ప ప్రభావితం అభివ్యక్తపడగలది-మనల్ని అనుగ్రహించగలది. పరమాత్మ సంకల్పం దైవానుగ్రహం.

''అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః (భ.గీ.18-66) అయితే సిద్ధిని పొందడం-స్వస్వభావ-సుస్వరూప-స్వకర్మాచరణ మేరకు జరుగుతుంది. సకలకర్మల నుండి (కర్మబంధం) మనల్ని విముక్తి పరచి మోక్షమును మనకు ప్రసాదించగలది విశ్వాత్మదైవిక అభివ్యక్తం దైవానుగ్రహమే. పరమాత్మ సంకల్పం అర్జునునికి(జీవాత్మ) శ్రీకృష్ణుని వలన (పరమాత్మ) లభించినదిదే

మన ఉనికిని సార్థకం చేసి-నిలకడను ఇవ్వగలది-''మనోబుద్ధ్యహంకృతి -నివారిణి'' ''ఆత్మ సమర్పణ''-అయితే మన మనుగడను అర్థవంతం చేసి కొనసాగించగలది. గుణకర్మ ప్రవృత్తికి నివృత్తినిడగల ''నిష్కామ కర్మ''-మన వికసనకు నిలువటద్దముగ ఉండగలది. ''విశ్వాత్మదైవిక అభివ్యక్తమే''-మనోబుద్ధ్యహంకృతికి లోబడిన ఆత్మ వినాశనం సంభవించును. గుణకర్మ ప్రవృత్తికిలోనైనజగత్ మాయాజాలములో పడతాము. విశ్వాత్మదైవిక అభివ్యక్తమునకు అవరోధము కలుగును. ''జీవితం-ముక్తి-మోక్షం'' అర్థాలే తారుమారవుతాయి. కేవలం ఇవి వ్యర్థ పదార్థాలుగ వ్యక్తపడతాయి. అర్థవంతమైన పారమార్థిక జీవితానికి అపశ్రుతి కలుగుతుంది. అందుకు ప్రాతిపదిక విశ్వాత్మదైవికం అభివ్యక్తం ఆత్మ సమర్పణ-నిష్కామ కర్మ-పరమాత్మానుగ్రహం శ్రీ భగవానువాచ.

సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ (భ.గీ.18-66)

కర్మాసక్తి జీవితం.(Life) ఆత్మ శక్తి వలన అందగలది- జీవన్ముక్తి. (Realisation of material life) పరమాత్మ అనుగ్రహం వలన పొందగలది మోక్షం. (Realisation of spiritual life) ప్రసాదించబడగలది మోక్షం. నిజానికి "ఆత్మశాంతి"-పర్యవసిత రాగ రూప సారూప్యతే-మోక్షం. అనుగ్రహం వలననే మోక్షప్రాప్తి-మోక్షమున-రాగద్వేష రహిత సమాధిస్థితి. ఆత్మ స్మృతి-"పరమాత్మానుగ్రహం."

నష్టో మోహః స్మృతి ర్లబ్ధా
త్వత్ప్రసాదాన్మ యాచ్యుత (భ.గీ. 18-73)

తనలో అజ్ఞానం నశించినది- తనకు జ్ఞానము కలిగినది- "పరమాత్మ" అనుగ్రహమిది. హేతు ధర్మామృత మిదం యదోక్తం పర్యుపాసి(భ.గీ.12-19) కర్మ త్యాగం- కర్మ యోగం-రెండూ మోక్ష కారకములే. కర్మ త్యాగం కన్న కర్మయోగము మిన్న. శ్రేష్ఠం(భ.గీ.5-2) ఆసక్తిని ఫలితాల్ని ఆశించని- యజ్ఞదాన తపః కర్మలు-చేయవలసిన కర్మలుగనే ఉండును (భ.గీ.18-6) దేనిని కూడ ద్వేషించని వారు, దేనిని కూడ కోరని వారు కర్మయోగులు ద్వంద్వాతీతులు. రాగద్వేషరహితులు.(భ.గీ.5-3). పరమాత్మ అనుగ్రహానికి పాత్రులు. మోక్షప్రథమునకు అర్హులు. జీవన్ముక్తులు . మోక్ష సాధకులు. ధన్యజీవులు.

సర్వోత్కృష్టమైన "నిష్క్రియాత్మను" పొందిన తదుపరి సిద్ధిని పొందగలరు(భ.గీ18-49) సమస్తకర్మలు- త్రిగుణాత్మక మాయాజాలంతో కూడినవి- పొగచేత అగ్ని కప్పబడినట్లుగ త్రిగుణాత్మిక మాయలో ఇవి మరుగు పడి ఉంటాయి. వీటి నుండి విడివడి నైష్కర్మత్వ సిద్ధిని పొందాలి. కర్మసిద్ధిని వడిసిన వారు పరమాత్మను తమ జ్ఞాన సిద్ధితో పొందగలరు (భ.గీ.18-50).

స్థితప్రజ్ఞుడే మోక్షమునకు సమర్థుడు(భ.గీ.18-53) పరమాత్మతో తన ఆత్మను తాదాత్మ్యతను పొందించు కొనగలిగిన సమర్థుడు. నిజానికి కర్మలనందలి నైపుణ్యమును "యోగము" అని చెప్పబడినది- "యోగః కర్మసు

కౌసలమ్'' మనోబుద్ధ్యహంకృతిని నివారించుకోగలిగి- గుణ కర్మ ప్రవృత్తిని నివృత్తి పరచుకొనగలవాడే సమర్థుడు. కర్మిష్టి- కర్మయోగి- కర్మజ్ఞాని. మనో బుద్ధ్యహంకృతిని- దాటగలిగినవాడే కర్మిష్టి. గుణకర్మ ప్రవృత్తిని అధిగమించ గలిగిన వాడే - కర్మజ్ఞాని. విశ్వాత్మ దైవిక అభివ్యక్తముగ నిలచినవాడే కర్మయెగి.

భౌతికాధ్యాత్మిక సమన్వయ దీపిక- భూమిక- రూపిక- ''జీవితం''.

మనోబుద్ధ్యహంకృతిని కలిగినది జీవితం (కర్మ)

గుణకర్మ ప్రవృత్తితో కూడినది ముక్తి (జ్ఞానం)

విశ్వాత్మ దైవికముగ నిలుచునది మోక్షం (అనుభవం).

పరిపూర్ణ మానవ సృష్టికే ప్రాతిపదిక కర్మ జ్ఞానానుభవం. (Action- Devine -Spirit)

అయితే వ్యక్తికి ముక్తి అనేది- కలుగడం మనోబుద్ధ్యహంకృతిని నివారించుకొని, గుణకర్మ ప్రవృత్తిని నివృత్తి పరచుకొని, విశ్వాత్మ దైవిక అభివ్యక్తముగ నిలచినపుడే సాధ్యం, ఇంతటితో (జీవితం+ ముక్తి) జీవన్ముక్తి లభించినను మానవజీవిత పరమార్థం నెరవేరదు. పరిపూర్ణ మానవసృష్టికి ఇది చాలదు. జీవన్ముక్తి మించిన మోక్షమును, అందగలగాలి. పొందగలగాలి. ఇది సాధనవలన లభించదు. పరమాత్మ అనుగ్రహం వలన మనకు అంకురించ గలది. మోక్షం ''విశ్వాత్మదైవిక అభివ్యక్తం''. దైవానుగ్రహం ఇది- ''జీవితం - ముక్తి - మోక్షం''.

''వైదిక కర్మల'' వలన నైష్కర్మసిద్ధి కలుగుతుందన్నను, ''గీత'' కాదనలేదు. సాధన సంస్కార బలం వలన, ''ఆత్మ జ్ఞానం'' లభిస్తుందన్నను గీత ''లేదనలేదు''. వేదమును (కర్మ) కాదననిది, ఉపనిషత్‌ను(జ్ఞానం) లేదననిది, **''కర్మ- జ్ఞాన-సముచ్చయం''**. ఒక పక్షి రెండు రెక్కలు. ఇది ప్రవచనం. శ్రీకృష్ణ పరమాత్మ వచనం. దేశకాలమాన రూపాతీత- ''భగవత్తత్వం'' ''శ్రీ భగవద్గీత'' భగవానుని ధూత. విశ్వానికి నేత. మోక్షప్రదాత.

''అసతోమా సద్గమయా
తమసోమా జ్యోతిర్గమయా
మృత్యోర్మా అమృతంగ మయా''
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ప్రజాకవి - వంగపండు
పెందుర్తి
విశాఖపట్నం

-సమాప్తం-

# అర్థపద పట్టిక

అనుభవం - Spirit
ఆత్మ - Self
అర్థం - Livily hood aspiration
ఆత్మజ్ఞానం - Self Knowledge
అధర్మం - Impiety
అనార్యుడు-Un worthy of religious man
అస్వర్గమ్ - Controry to the attainment of Heaven
అకీర్తికరం - Disgraceful
అమానుషత్వం - Un manliness
అచేతన - non conscience
అతీంద్రియ - Being sense perception
అద్వైత - Non - dual
అధర్మ - Demerit
అనుభూతి - Experience
అనాది - Beginingless
ఆధ్యాత్మిక స్వేచ్ఛ - Spiriual freedom
ఆనంద - Soul
అక్షరుడు - Impershible
ఆచారం - Custom
అసహజ ప్రవృత్తి - In born nature
ఆత్మవిచక్షణ - Self discriptive
ఆరాధన - Worship
అభయం - Fearlesness
అనాధ్యాత్మికం - Unspiritual
అభిప్రాయము - Tenderness
అనంతజ్యోతి - Universal light
ఆత్మ వివేకం - Self realisation
ఆధ్యాత్మిక జీవన సూత్రం- Order of spiritual life

అనంతసత్యం - Absolute Supreme
ఆధ్యాత్మిక ధృక్పధం - Spritual distiny
ఆచరణ కర్మ - Practical work
ఆత్మ - Soul
ఆత్మ-స్మృతి - Self discovery
అభిరుచి - Intrest
అధోగతి - Lower stage
అర్జునుడు - Englightened personal-ity
ఆత్మ సమర్పణ - Non- attachment
అహంకృతి - Egoism
ఉపాసన - Devotion/Spirit
ఉపాసన మార్గం - Worship by way of life
ఉనికి - Existence
ఉత్తమ క్షేత్రజ్ఞుడు -Supreme Lord
ఉత్తమ పురుషోత్తముడు -Supreme Self
ఓర్పు
కర్మ - Action/Capacity/Work
కామం - Human Desire/Existence
కులం - Family
కులక్షయం - Dueto decay of family
కులస్త్రీలు -The woman of the family
కర్మజ్ఞానానుభవం - Action -Devine- Spirit
కాయకర్మ - Action Body
కృషి - Striving
కర్మిష్ఠి - A man of Action
కర్మ జ్ఞాని - A man of wisidom
కాంతి రేఖ - Worship form





కర్మజ్ఞానోపాసకుడు - A Man of self Realisation

క్షేత్రం - The feild

క్షేత్రజ్ఞుడు - Knowledge

క్షరుడు - Pereshible

కర్మబంధము - Bondage

కులవిధానం - Systems of castes

కర్మ నిబంధన - Rules of action

కర్మయోగి - A man of self Realisation

కర్మిష్టివాదము - Way of Action

కులధర్మం - Family religions Protection

గుణం - Quality / Apptitude

గుణత్రయం - Three fold desigination of Quality

గుణకర్మ ప్రవృత్తి - Quality -Capacity- Energy

చిత్ - Spiritual body

చిత్తశుద్ధి - Purity of Heart

చైతన్యము - Conscience

జ్ఞానం - Deivne / Knowledge

జీవితం - life

జనార్ధనుడు - Supreme spirit

జాతిధర్మం - Caste Religious Protection

జ్ఞానాన్వేషి - Wise man

జీవి - Body minded

జీవాత్మ - Human Soul

జ్ఞానాన్వితం - Life wisdom

జ్ఞానయోగనిష్ఠ - Path of Knowledge

జ్ఞాన ప్రవృత్తి - Wisdom

జీవన్ముక్తి - Perfection

జీవన గమనం - Desire and enjoyment

జ్ఞాననిష్ఠ - Path of Realisation

జీవన సత్యం - Persuit of truth

జనుడు - Human individual

తత్త్వం - True light

తడబాటు - Compulsion

త్యాగం - Sacrifice

తమస్సు - Inertia

తృష్ణ - Leest

తమోగుణం - Inertia of action and mind

దైవికం - Godliness

ధర్మం - Fortitude

ద్విజుడు - Twice born

దివ్యదృష్టి - Devine light

దివ్యాత్మ - Vision

దుర్మార్గం - Spirit of evil

దుస్సంకల్పం - Selfish will

దైవానుగ్రహం - Will of the supre self

దురదృష్టము - Unfortunate

దేవాది దేవుడు - God of Gods

దైవికాంశాలు - Eternal elements

నరకం - Hell

నమ్మకం - Belief

నిస్వార్థభావన - Selfless view

నిస్సంగత్వం - Non -Attachment

నిత్యవిజ్ఞానాభిలాషి - Seeker of intellegence

నిర్దేశాత్మకం -Amandate for action
నిష్కామకర్మ - Desirelessness Action
ప్రజ్ఞావాదము - World of Wisidom
పితరులు - Ancestors
పితృలోక - A temporary abode immeditely after death
పాపము - Sin
ప్రతిభావంతుడు - Intellengence
పరమాత్మ - Body Supreme self
పరబ్రహ్మం - Absolute reality
పరాక్రమం - Bold ness
ప్రవృత్తి - Energism
పూర్వీకులు - Sages
పారమార్థిక సత్యం - Absolute Reality
ప్రకృతి - Nature
పనితనం - Quality
బుద్ధి - Intelegence
బ్రహ్మ - Absolute reality
బీజం - Seed
బ్రహ్మస్థితి - Life eternal
రుజువర్తనం - Upright ness
మనస్సు - Mind
ముక్తి - Realisation of Natural life / Perfection
మోక్షం - Realisation of Spiritual life / Salvation
మానవాత్మ
త్రయీవిధాత్మకం -Tripple designation of Human self

మనోబుద్ధ్యహంకృతి - Mind intelegence spirit
మానసిక కర్మ - Spirit
మానవాత్మ వికసన - Evolution of human soul
మహత్తర అంశాలు - Eternal elements
యోగనిష్ట - The path of Action
యోగమాయ - Mystery of universe
రజస్సు - Atraction
రజోగుణం - Energy of activity and mind
విశ్వం - World
విభాగ త్రయం - Three fold designation of energism
వర్ణసంకరం - Mixture of caste
వర్ణం - Caste
వాచిక కర్మ - Devine
విశ్వప్రభువు - Supreme Lord
వివేచన - Thought
వర్ణసంక్షోభం - Confusion of castes
విభాగప్రాతిపదిక - Functional divisions
వస్తూత్పత్తి సేవల సృష్టి - Production of goods and services
వ్యక్తిగత దైవానుభవం - Personal experience of the God
విశ్వాసం - Faith
వివేకం - Reason
వ్యక్తిత్వం - Character
విముక్తి - Liberation
శిష్యుడు - Disciple
సుఖదుఃఖాలు - Pain and pleasure
సత్త్వగుణం - Equibriliation of mind and activity
సత్ - Matter
సరియైన ఆలోచన - Positive thinking

సంసిద్ధి - Perfection
సృష్టి నిర్మాణ సాక్షి - Manifesto devinity
సర్వాంతర్యామి - Eternal being
సామర్థ్యం - Capacity
సాంప్రదాయం - Social convention
సన్యాసినిష్ఠ - Path of remuneration
స్థితప్రజ్ఞత - Steed fastness

సంకర గుణం - Mixed quality
స్వభావము - Temperaments
సౌశీల్యము - Virtue
సంగ్రామరంగం - Life in a Battle
స్వేచ్ఛాసంకల్పం - Free will
సామాజిక ధర్మం - Law of society
హృదయ దౌర్బల్యం - Mean Faint Heartedness

మనోబుద్ధ్యహంకృతి. - సదసచ్చాహమర్జునా (భ.గీ.9-19)

గుణకర్మ ప్రవృత్తి. - సదసత్తత్పరం యత్ (భ.గీ.11-37)

విశ్వాత్మదైవికం. - అనాదిమత్ పరబ్రహ్మ (భ.గీ.13-13)

**సాత్త్వక గుణకర్మ ప్రవృత్తి :-**
శమః - Control of Mind
ధమః - Control of senses
తపః - Austrity
శౌచ - Purity
జ్ఞానం - Knowledge
విజ్ఞానం - Realisation
ఆస్తిక్యమ్ - Belief

**రాజసిక గుణకర్మ ప్రవృత్తి :-**
శౌర్యం - Power
తేజో - Boldness
ధృతి - Fortitude
దానం - Generacity
ఈశ్వరభావం - Soveriginity
సృష్టి - Origin
స్థితి - Existience
లయలు - Rebirth
పరమపదం -Goal eternal

**తామసిక గుణ కర్మ ప్రవృత్తి :-**
కృషి - Agriculture
గోరక్ష - Cattle rearing
వాణిజ్యం - Trade

**సంకర గుణ కర్మ ప్రవృత్తి :-**
పరిచర్యలు - Services

స్థూల శరీరం - సనాతనమైనది
సూక్ష్మ శరీరం - చిదాత్మపరం
కారణ శరీరం - ఆత్మపరమైనది

అహంకారం - ఆసక్తి లేనివారు - Free from pride and delusion
పారమార్థిక జ్ఞానం - Even dwelling in the self
సనాతన అంశం - eternal element
పంచేంద్రియాలు - Five senses of mind

మనస్సు - Being in the of all exstience   పరంజ్యోతి - Supreme Light
ఆత్మజ్ఞానం - Philosophical knowledge   మోక్షం - Bless
ఆనందం - Happyness   పరమాత్మ - Highest self of the Lord

**లోకత్రయం**

భూః (Earth)  భువస్సు (The mind region)  సువర్ (The Heaven)

నిస్సంగత్వము (Renounciation)  బ్రహ్మాన్ (Supreme soul)

**భౌతిక వాదం**

ప్రకృతి జడ పదార్థం - శరీరం శాశ్వతం - ఆత్మ అన్నది లేదు

**ఆధ్యాత్మిక వాదం**

దేహాతిరిక్తమగు'' ఆత్మ'' ఒకటి ఉంది - బ్రహ్మ సత్యం

**పాదార్థిక చైతన్యవాదం :-** Doctrine of matter, spirit and soul

సాంఖ్య పతంజలి మతం - విశ్వరచయిత్రి - ప్రకృతి
స్వతః పరిణామ ఫలితం - జగత్

న్యాయవైశేషిక మతం - ఆత్మ - కర్తవ్య- భోక్తవ్యం కలది
నిమిత్త కారణం ఈశ్వరుడు
ఉపాదాన కారణం - ప్రకృతి
పృద్వి - జలం - తేజం- వాయువు
ఐదవది లేదు

వేదమతం - ఆత్మ - సుఖదుఃఖాలకు అతీతం
నిర్వికారి - కర్తవ్యం భోక్తవ్యం కలది కాదు

గీతా మతం - కర్మాధికారి జీవుడు కర్మ ఫలదాత దేవుడు
ప్రకృతి - పురుష- సంయోగం- '' ఈశ్వరేచ్ఛ''

నిష్కామ కర్మ - సర్వ కర్మఫల పరిత్యాగం

వైదిక కర్మలు - యజ్ఞ - దాన - తపములు

నాస్తికమతము - పాదార్థిక చైతన్యము తప్పించి ఆత్మ చైతన్య మనేది లేదు
సృష్టి కర్త ఎవరూ లేరు - అనీశ్వరత్వం- జగత్- పరిణామం.

**సాధన చతుష్టయ సంపత్తి :-**

**1.** ఆత్మానాత్మ వివేకం (శాస్త్రాధ్యయనం)
**2.** ఐహికా ముష్మిక ఫల మందనాసక్తి ( ఇహమాత్ర ఫలభోగ విరాగం)
**3.** షట్క సంపత్తి (శమదమాది షట్కం) **4.** మోక్షాసక్తి (ముముక్షత్వం)

**చతుర్విధ భక్తులు :-**

**1.** ఆర్తుడు - గజేంద్రుడు **2.** జిజ్ఞాసి - ఉద్ధవుడు **3.** అర్థార్థి - ధ్రువుడు
**4.** జ్ఞాని - ప్రహ్లాదుడు  యోగి - పునర్జన్మ రహితుడు
కర్మిష్టి - పునరపి జననం పునరపి మరణం
జీవితం (త్రయీవిధాత్మకం) ముక్తి (భౌతికం) మోక్షం ( ఆధ్యాత్మికం)

## పరిశోధనకు పరిశీలించిన
## ఆంధ్ర గ్రంథములు

| గ్రంథం | | చిరునామా |
|---|---|---|
| 1) ప్రస్థాన త్రయం | - | సుధావ్యాఖ్య సమేతం<br>శ్రీ శంకరానందగిరి-గంజిగుంట మఠం<br>ప్రణతానందాశ్రమం-వజ్రకరూర్-<br>వయా - గుంతకల్లు. |
| 2) సర్వవేదాంతసార సంగ్రహం | - | శ్రీసురేశ్వరాచర్య విరచితం<br>ప్రచురణ-వావిళ్ల రామస్వామిశాస్త్రి అండ్ సన్స్<br>చెన్నపురి - 1995 అనువాదం. |
| 3) శ్రీమద్భగవద్గీత | - | శ్రీధరీయటీకా తాత్పర్యసహితం<br>శ్రీ నిర్వి కల్పానందస్వామి<br>శ్రీ రామకృష్ణ మఠం-మైలాపుర్-మద్రాస్-4 |
| 4) ధర్మోపదేశములు | - | శ్రీ సద్గురు మళయాల స్వామిలవారు<br>శ్రీ వ్యాసా శ్రమం-వయా-ఏర్పడు<br>చిత్తూరు జిల్లా. |
| 5) వివేక చూడామణి | - | శ్రీమత శంకరాచార్య విరచితులు<br>వావిళ్లు రామస్వామి అండ్ సన్స్<br>చెన్నపురి - 1957 |
| 6) ప్రాచీన భగవద్గీత (745 శ్లోకాలు) | - | Dr. వేదవ్యాస్<br>భారతీయ ప్రచురణ సాయి నిలయం<br>హైదరాబాద్. |
| 7) శ్రీ భవద్గీతాసారము | - | ప్రచురణ<br>కార్యనిర్వహణాధికారి<br>T.T.D. తిరుపతి -1986 |
| 8) శ్రీమళయాళయతీంద్రగీత | - | శ్రీ వేదవ్యాసముద్రాక్షరశాల<br>చిత్తూరు వ్యాసాశ్రమం-1954 |

| | | |
|---|---|---|
| 9) ఇదియే ఇస్లాం | - | సయ్యద్ అబ్దుల్ అమ్ ఎస్. ఎమ్. హబీబ్ తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్సు సందేశభవనం-హైదరాబాద్ |
| 10) క్రొత్త నిబంధన గ్రంథము | - | బైబిల్ సొసైటీ ఆఫ్ ఇండియా బెంగుళూర్ |
| 11) మహాభారతం | - | కవిత్రయం |
| 12) శ్రీమద్భాగవతం | - | పోతన |
| 13) భాస్కర రామాయణం | - | భాస్కరుడు |
| 14) శ్రీమద్భగవద్గీత (శంకర బాష్యసమన్వితం) | - | ఆనందగిరి W.G.Estate,ఆనందాశ్రమప్రెస్ బొంబాయి 1936 |
| 15) భారతీయ తత్త్వశాస్త్రం | - | ఏటుకూరి బాలరామమూర్తి విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్ విజ్ఞానభవన్-4-1-435-బ్యాంక్‌స్ట్రీట్ హైదరాబాద్. |
| 16) శ్రీ భగవద్గీ | - | విద్యాప్రకాశనందగిరిస్వామి-విరచితం శ్రీ శుక బ్రహ్మాశ్రమం కాళహస్తి-చిత్తూరుజిల్లా-1973 |
| 17) బౌద్ధం-మార్క్సిష్ట దృక్పథం | - | రాహుల్ సాంకృత్యాయన్ ఏటుకూరి బలరామమూర్తి |
| 18) ప్రాశ్చ్యమతత్త్వశాస్త్ర చరిత్ర | - | ప్రవేశిక మౌలానా అబుల్ కలామ్‌ఆజాద్ ఆంధ్రసారస్వత పరిషత్-హైదరాబాద్ |
| 19) యోగామృతం | - | పి. సదర్శనరెడ్డి-మలకపేట యోగక్షేంద్రం-హైదరాబాద్-36 |
| 20) భారతతత్త్వ శాస్త్రపరిశీలన | - | జి. వెంకటేశ్వరు-పలమనేర కృష్ణాజిల్లా - ఆంధ్రప్రదేశ్. |

## పరిశోధనకు పరిశీలించిన
## ఆంగ్ల గ్రంథములు


| | | |
|---|---|---|
| 1) Sri Bhagavad Geeta Raharayam | - | Lokanaya Balagagadhartilak<br>Narayana feith - poona city<br>pag - 1220-1965 |
| 2) Vedanthe - the Culnination of Indian thought | - | R.D. Ranade<br>Bharatheeya Vidya Bhavan<br>Bombay - 1970. |
| 3) The Bhagavad Geeta | - | Dr.S. Radha Krishna<br>Maclmillian company<br>M.Street, London, Geat Britian |
| 4) Eastern Religion and western thought | - | Dr.S. Radha Krishna<br>Maclmillian company<br>M.Street, London, Geat Britian. |
| 5) The Islamic culture | - | Islamic culture Board<br>Hyderabad-50007, A.P. India |
| 6) Bunch of thoughly | - | Golwalkar<br>Vidran prakaram - Banglore-18 |
| 7) Talks as Atma Botha | - | By Swami Chaitanyananda<br>C.P.Trust - Madras-3 |
| 8) Modern life and Bhagavad Geeta | - | K.M. Munshi<br>New Delhi. |
| 9) The perfection of yoga | - | A.C. Bhakficre<br>Prabhapad Iskon<br>California - America |
| 10) Srimad Bhagavad Geeta | - | Swami<br>Advanta Ashramam<br>Calacutta - 14 |
| 11) Maximam and the Bhagwad Geeta | - | S.G. Sardesai Deling Bone<br>People publishing house PVT Ltd.<br>New Delhi. |
| 12) Introducation to Jantra Sastra | - | Sri Jhan wood rofee<br>Ganesh & Company(T.S)<br>Madras - 1969 |